# బ్లాక్ డే నిరసనలు




కడప



అనంతపురం




కర్నూలు జిల్లా ఆత్మకూరు




చిత్తూరు




ప్రకాశం జిల్లా కె.వి.పాలెం




గుంటూరు జిల్లా పిడుగురాళ్ల




కృష్ణాజిల్లా ఇబ్రహీంపట్నం




పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు

మన
# రైతువాణి
జూన్ - 2021
సంపుటి : 31 సంచిక : 6
వెల : రూ. 20 పేజీలు : 52
సంవత్సర చందా : రూ. 230/-



మన రైతువాణి
3/4బి, వడ్డేశ్వరం బైపాస్, వడ్డేశ్వరం (పోస్ట్)
తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా
పిన్ : 522 502
E-mail : rytuvani@gmail.com

చెక్కులు, డి.డి లు Mana Rytu vani
పేరుతో పంపాలి.
SBI Ac No : 52024133051
IFSC : SBIN0020343

## విషయసూచిక



నన్ను నమ్మండి.
ఇది మీ మంచి కోసమే
వ్యవసాయ బిల్లు
కార్పొరేట్స్
రైతు




నేను మీకొక కథ చెప్తాను


# గీతోపదేశాలు



ఇది నీకు అవసరమా? లేక కావాలా?
నిరుద్యోగం నుంచి విముక్తి
ఏదో సరదాగా.. పెట్టె ఖాళీగా ఉంది
Rajendra NH




దూరంగా తొలుగు దీనికి రివర్స్ గేర్ లేదు.
వ్యవసాయ బిల్లు 2020




నకిలీ విత్తనాలు
మార్కెట్‌లో నకిలీ విత్తనాలు

సంపాదకీయం... 

# ఖరీఫ్‌కు శ్రీకారం చుట్టినా ప్రభుత్వానికి ఉలుకేది?

మృగశిర ప్రవేశించింది. రుతు పవనాలు కూడా పలుకరిస్తున్నాయి. ఏరువాక మొదలైంది. గత పంట తాలూకూ దాబడి చేతిలో లేకపోయినా.. నానా అవస్థలు పడి పెట్టుబడులు సమకూర్చుకొని రైతు ఖరీఫ్ సాగుకు శ్రీకారం చుట్టాడు. అయితే ఈ సారి వ్యవసాయ శాఖ రైతుకు సరైన భరోసా ఇవ్వడం లేదు. మొదట్లో.. ఏయే పంటలు వేయాలో ముందుగానే సూచిస్తూ ప్రచారం చేస్తామని చెప్పిన వ్యవసాయ శాఖ ఉలుకూ పలుకూ లేకుండా ఉంది. మండలాల వారీగా సబ్సిడీ విత్తనాలు నిల్వల గురించి, పంపిణీ గురించి ప్రకటించడం లేదు. సాగును లాభసాటి చేసేందుకు రైతు భరోసా కేంద్రాలు పెట్టి మీ ఊళ్లోనే అన్ని సలహాలు అందిస్తామని, ఉత్పత్తులను కూడా ఇక్కణ్ణుంచే అమ్ముకోవచ్చని చెప్పిన ప్రభుత్వం.. ఎదురవుతున్న ఎన్నో సమస్యలకు పరిష్కారాలను చూపలేకపోతోంది. రైతు నుంచి ధాన్యం ఇలా కొనుగోలు చేసి అలా మీ ఖాతాల్లో డబ్బులు వేసేస్తాం అని ప్రభుత్వం డంబాలు పలికింది. నెల రోజులైనా ధాన్యం డబ్బులు రైతు చేతికందలేదు.

మళ్లీ ఖరీఫ్ సాగు ముంచుకొచ్చింది. చేతిలో చిలిగవ్వలేదు. తాము చెల్లించాల్సిన డబ్బు రైతుకిస్తే సాగుకు ఉపయోగపడతాయన్న కనీస స్పృహ కూడా రాష్ట్ర ప్రభుత్వానికి ఉన్నట్లు కనిపించడం లేదు. కొనుగోళ్లు జరిగినవి జరగ్గా ఇంకా రైతుల వద్ద 40 లక్షల టన్నుల ధాన్యం ఉంది. ప్రతి గింజనూ కనీస మద్దతు ధరకు రైతుల చెంతనే కొనుగోలు చేస్తామని, వారి కళ్లాల్లోనే కొంటామని ప్రభుత్వం చెప్పింది. ఇది నిజమే అనుకున్నారు రైతులు. రబీ ధాన్యం 45 లక్షల టన్నులు కొనాలని లక్ష్యంగా పెట్టుకున్నా అందులో సగం కూడా కొనుగోళ్లు చేయలేకపోయింది. మాట్లాడితే తమది రైతు పక్షపాత ప్రభుత్వం అని ప్రకటిస్తూ ఉంటుంది. కానీ ఆచరణలో రైతు వివక్ష ప్రభుత్వం అని రుజువు చేసుకుంటోంది.

కరోనా కారణంగా అని ఇప్పుడు చెపుతున్నారుగానీ.. అంతకుముందు ఏ యేడాదయినా ఏ పంటకయినా కనీస మద్దతు ధర లభించిందా? ఈ కరోనా పేద మధ్య తరగతి ప్రజలను పీల్చి పిప్పి చేసినట్లే రైతులను, కౌలు రైతులను నిలువునా ముంచేసింది. అనేక పంటలకు ధరలు దారుణంగా పతనమయ్యాయి. ఆరంభంలో మాత్రం జగన్మోహనరెడ్డి ప్రభుత్వం ప్రతి పంటకూ గిట్టుబాటు ధర గ్యారంటీగా ఇప్పిస్తాం అని చెప్పారు. మిర్చి, పొగాకు, ఆక్వా, మామిడి, శనగ, మొక్కజొన్న, అరటి, పూల ఉత్పత్తులకు ప్రస్తుతం గిట్టుబాటు ధరల్లేవు. ప్రభుత్వం వీరికి గిట్టుబాటు ధరలు ఇప్పించే సంగతి (ఇంతకు ముందు తాను వాగ్దానం చేసిన విషయం) మర్చిపోయింది.

మరోవైపు వ్యవసాయ బడ్జెట్ రైతులకు ఉపశమనం కలిగించేలా లేదు. రాష్ట్రంలో కార్పొరేట్ సాగును ముందుకు తీసుకుపోయేలా వ్యవసాయ ప్రత్యేక బడ్జెట్ దారులు పరిచింది. పంటల ధరల స్థిరీకరణ నిధికి భారీగా నిధులు కోతపెట్టింది. సాగు మొదలు పెట్టబోతున్న రైతులకు పెరిగిన ఎరువుల, పురుగుమందుల ధరలు స్వాగతం పలుకుతున్నాయి. వ్యవసాయ ఖర్చులు భారీగా పెరిగాయి. ప్రస్తుత సీజన్‌లో సబ్సిడీ విత్తనాలు తక్షణం అవసరం. వీటికి సంబంధించిన ప్రణాళికను వ్యవసాయ శాఖ ప్రకటించాలి. సందట్లో సడేమియాలా నకిలీ విత్తనాలు దండిగా అమ్మకాలు చేస్తున్నారు. మరోవైపు విత్తనాభివృద్ధి సంస్థలు సేకరించిన విత్తనాలు కూడా నాణ్యం తక్కువగా ఉంటున్నాయనే విమర్శ రైతుల నుంచి వినవస్తోంది.

ఇటు వ్యవసాయం చేస్తూ.. అటు ఉత్పత్తులు అమ్ముకోలేక సతమతమవుతూ కూడా రైతులు ఈ కాలంలో పెద్ద ఎత్తున ప్రభుత్వ విధానాలపై స్పందించడం విశేషం. కేంద్ర బీజేపీ ప్రభుత్వం ప్రవేశపెట్టిన మూడు నల్ల వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా ఆరున్నర నెలలుగా పోరాడుతూనే ఉన్నాడు. సంయుక్త కిసాన్ మోర్చా చేపట్టిన అన్ని కార్యక్రమాల్లోనూ పాల్గొంటున్నాడు. ఢిల్లీ సరిహద్దుల్లో రైతు ఉద్యమం ప్రారంభమై జూన్ 15వ తేదీకి 200 రోజులు పూర్తి కావస్తోంది. అదే సందర్భంలో ఈ ఉద్యమంలో పాల్గొన్న 500 మందికి పైగా రైతులు ఆత్మబలిదానం చేశారు. ఇంత సమరోత్సాహంతో సాగుతున్న రైతు ఉద్యమానికి రాష్ట్ర రైతాంగం అన్ని విధాలా సంఘీభావం ప్రకటిస్తూ అనేక కార్యక్రమాల్లో పాల్గొంటున్నది. వీటితోపాటు స్థానికంగా ముందుకొచ్చిన రైతు సమస్యలపై పోరాటాలు కూడా పట్టువిడవకుండా సాగిస్తోంది. అవి ధాన్యం కొనుగోళ్ల విషయం కావచ్చు. తుపాను నష్టాలు కావచ్చు. రైతులు గతంలో కంటే చైతన్యంగా ప్రభుత్వ విధానాలపై పోరాడుతున్నారు. ఇప్పుడు రైతులు అటు వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా పోరాటంతోపాటు, ఇటు తమ ముందుకొచ్చిన వ్యవసాయ సీజన్‌ను బట్టి కూడా వ్యవహరించవలసి ఉంటుంది. ఈ రెండింటిని సమన్వయ పరుచుకుంటూ రైతు తమ దశను మార్చుకోవనికి అవసరమైన ప్రత్యామ్నాయ దిశను ప్రయాణించవలసి ఉంది.

# దేశమంతటా సంపూర్ణ క్రాంతి దివస్



## నల్లచట్టాలపై నిరసన సెగలు

కేంద్రంలో మోడీ ప్రభుత్వం మూడు నల్ల వ్యవసాయ చట్టాలను ఆర్డినెన్సు ద్వారా తీసుకొచ్చి ఏడాది అవుతున్న సందర్భంగా జూన్ 5న దేశ వ్యాప్తంగా బిజెపి ఎమ్మెల్యేలు, ఎంపీల ఇళ్లు, కార్యాలయాల ముందు ఈ చట్టాల ప్రతులను తగులబెట్టడం ద్వారా తమ నిరసనాగ్రహాన్ని వ్యక్తం చేశారు. మోడీ మూడు నల్ల చట్టాలను తీసుకొచ్చిన రోజున నలభైకి పైగా రైతు సంఘాలతో కూడిన సంయుక్త కిసాన్ మోర్చా (ఎస్‌కెఎం)... ఈ "సంపూర్ణ క్రాంతి దివస్" పిలుపు ఇవ్వడానికి మరో విశిష్టత కూడా ఉంది. ఇప్పటి ప్రధాని ఇందిరాగాంధీ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు జయప్రకాశ్ నారాయణ్ "సంపూర్ణ క్రాంతి దివస్"కు పిలుపు ఇచ్చిందీ అదే రోజు. ఎస్‌కెఎం ఇచ్చిన పిలుపు అందుకొని దేశవ్యాప్తంగా ప్రదర్శనలు జరిగాయి. వీటిలో విద్యార్థి, యువజన, మహిళా సంఘాలు పాల్గొన్నాయి. గత ఆరు నెలలుగా రైతులు పోరాటం చేస్తున్న వాయవ్య ఢిల్లీలోని సింఘూ సరిహద్దు వద్ద సంయుక్త కిసాన్ మోర్చా నాయకులు ఈ చట్టాల ప్రతులను తగులబెట్టారు. నల్ల జెండాలను ఎగురవేశారు. ఈ సందర్భంగా ప్రదర్శకులను ఉద్దేశించి ఆలిండియా కిసాన్ సభ నాయకులు విజూ కృష్ణన్ మాట్లాడుతూ.. ప్రజాస్వామ్యాన్ని, ప్రజల జీవనోపాధిని కాపాడుకునేందుకు రైతులు రెండో పోరాటం సాగిస్తున్నారని అన్నారు. ఆనాడు జయప్రకాశ్ నారాయణ్ సంపూర్ణ క్రాంతి దివస్‌కు పిలుపు ఇచ్చిన రోజు (జూన్5)న మోడీ ప్రభుత్వం దుర్మార్గమైన మూడు నల్ల వ్యవసాయ చట్టాలను తెచ్చిందన్నారు. కనుక ఈ పోరాటం ప్రజాస్వామ్యం, ప్రజల బతుకుదెరువుకు సంబంధించినది కూడా అన్నారు.

### అనేక రాష్ట్రాల్లో మంచి స్పందన

సంపూర్ణ క్రాంతి దివస్‌కు ఎపి, తెలంగాణా, కర్నాటక, తమిళనాడు, ఒడిస్సా, ఛత్తీస్‌ఘడ్, బీహార్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, పంజాబ్, హర్యానా, రాజస్థాన్, ఉత్తరాఖండ్, హిమాచల్ ప్రదేశ్, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాల్, త్రిపుర, కేరళ, ఈశాన్య రాష్ట్రాల్లో మంచి స్పందన వచ్చింది. అనేకచోట్ల బిజెపి నాయకుల ఇళ్లు, కార్యాలయాల వద్ద ఘెరావ్ చేశారు. ప్రభుత్వ కార్యాలయాల వద్ద నిరసన ప్రదర్శనలు జరిగాయి. కొన్నిచోట్ల ప్రపంచ పర్యావరణ దినోత్సవం సందర్భంగా మొక్కలు నాటారు. మరికొన్నిచోట్ల చట్టాల కాపీలు దగ్ధం చేయడానికి ముందు శవయాత్రలు నిర్వహించి మాక్ అంత్యక్రియలు నిర్వహించారు.

### హర్యానాలో లాఠీఛార్జీ

హర్యానాలోని పంచులాలో జిరక్‌పూర్ -కల్కా రహదారిని అడ్డుకున్న నిరసనకారులపై పోలీసులు లాఠీఛార్జీ చేశారు. నల్ల చట్టాల కాపీలను తగులబెట్టడానికి రైతులు హర్యానా అసెంబ్లీ స్పీకర్ జియాన్ చంద్ గుప్తా నివాసం వైపు వెళ్లారు. పోలీసులు మాజ్రీ చౌక్ వద్ద రైతులపై జులుం ప్రదర్శించారు.. లాఠీఛార్జీలో పలువురు రైతులు గాయపడ్డారు. శాంతియుతంగా నిరసన తెలుపుతున్న రైతులపై హర్యానా ప్రభుత్వం కొనసాగిస్తున్న క్రూరత్వాన్ని ఎస్‌కెఎం ఖండించింది. హిసార్‌లో హర్యానా డిప్యూటీ సిఎం నివాసం వద్ద వందలాది మంది పోలీసులను ప్రభుత్వం మోహరించింది. అయినప్పటికీ వేలాది మంది రైతులు సమావేశమై చట్టాల కాపీలను తగులబెట్టారు.

### బిజెపి కార్యాలయాల వద్ద నిరసన

గుర్గావ్‌లో బిజెపి ఎమ్మెల్యేల కార్యాలయం ముందు ఎస్‌కెఎం నేతలు ప్రధాన రహదారిలో రాకపోకలను అడ్డుకుని నల్లచట్టాల కాపీలను తగులబెట్టారు. బిజెపి కార్యాలయం వెలుపల పెద్ద సంఖ్యలో పోలీసు బలగాలను మోహరించారు. రైతుల ప్రతిఘటన నేపథ్యంలో ముఖ్యమంత్రి మనోహర్‌లాల్ కత్తర్ తన పర్యావరణ కార్యక్రమాన్ని ఒక్కటిన్నర గంటలకే కుదించుకున్నారు. హర్యానాలో బిజెపి ఎమ్మెల్యే దేవేంద్ర బాబ్లికి వ్యతిరేకంగా నిరసన తెలిపిన రైతులను అక్రమంగా అరెస్టు చేయడాన్ని నిరసిస్తూ సుమారు 20 వేల మంది రైతులు హిస్సార్ నుంచి తౌహానాకు భారీ ర్యాలీ నిర్వహించారు. పంజాబ్‌లో కూడా పెద్దఎత్తున ప్రదర్శనలు, నిరసనలు జరగాయి. నిరసనకారులపై పోలీసులు పలుచోట్ల కేసులు పెట్టారు.

# భరోసా ఇవ్వని రాష్ట్ర బడ్జెట్




వైఎస్ జగన్ మోహన్ రెడ్డి గారు ముఖ్యమంత్రి అయినప్పటి నుండి తాను వాగ్దానం చేసినట్లుగా నవరత్నాల పేరుతో సంక్షేమ పథకాలకు పెద్దపీట వేశారు. కాని వాటికే పరిమితమవడం ప్రభుత్వమే ప్రకటించినట్లుగా సుస్థిర అభివృద్ధి, పేదలకు ఊరట కలిగించదు. కరోనా కష్టకాలంలో మందులు, వైద్యం ఉచితంగా లభిస్తేనే బయటపడగలుగుతారు. కానీ రాష్ట్ర ప్రభుత్వ వైద్య నిధులు 20 శాతమే పెంచింది. అది అవసరాలకు సరిపోయేది కాదు. కరోనా టీకాలకే దాదాపు రూ.3 వేల కోట్లు కావాలి. ఇప్పటికే టీకాల కార్యక్రమం ఆలస్యమైంది. ఇప్పటికైనా ఆరోగ్య రంగానికి ప్రాధాన్యతనిచ్చి నిధులు కేటాయించాలి. కాని ఈ బడ్జెట్ ప్రజలకు ఆ భరోసాను ఇవ్వలేకపోయింది.



వి. శ్రీనివాసరావు
ఎ.పి రైతు సంఘం
పూర్వ రాష్ట్ర కార్యదర్శి

ఒక్కరోజు జరిగిన రాష్ట్ర శాసనసభ 2021-22 సంవత్సరానికి రూ. 2 లక్షల 29 వేల కోట్లతో జమాఖర్చు లెక్కల్ని ప్రవేశ పెట్టింది. ఏప్రిల్ ఒకటి నుండి ఖర్చు చేయాల్సిన ప్రతి పైసాకు బడ్జెట్ ఆమోదం కావాలి. కరోనా తీవ్రంగా ముంచుకొచ్చిన నేపథ్యంలో అసెంబ్లీ బడ్జెట్ సమావేశాలు వాయిదా వేసి రాష్ట్ర ప్రభుత్వం ఆర్డినెన్సును తీసుకొచ్చింది. దాన్ని ఆమోదించడం కోసమే ఈ ఒక్కరోజు తతంగం. ప్రధాన ప్రతిపక్ష పార్టీ తెలుగుదేశం ఈ సమావేశాలను బహిష్కరించింది. గతంలో వైయస్సార్ కాంగ్రెసు చేసిన పొరపాటునే ఇప్పుడు తెలుగుదేశం చేస్తోంది. ప్రతిపక్ష బాధ్యత నెరవేర్చకపోవడం అంటే ప్రజల విశ్వాసానికి గండి కొట్టడమే. నల్లేరు మీద బండిలాగా అధికార పార్టీ బడ్జెట్‌ను ఆమోదింప చేసుకుంది. ఆర్థిక మంత్రి ఉపన్యాసంలో చరిత్ర పాఠాలకే సగం పోయింది. మార్చిలో కరోనా ఇంత ఉధృతంగా లేనప్పుడు అసెంబ్లీ సమావేశాలు నడిపి ఉంటే మరింత అర్థవంతంగా చర్చ జరిగి ఉండేది. అసెంబ్లీ సమావేశాలు జరిపే అవకాశం ఉన్నా ఆర్డినెన్సుల దారి ఎంచుకోవడం ప్రజాస్వామ్య వ్యవస్థకు మంచిది కాదు. రాష్ట్ర ప్రజల ప్రయోజనాలతో ప్రత్యక్షంగా ముడిపడి ఉన్న ఇంత ముఖ్యమైన సమావేశాలు ఏ చర్చా లేకుండా ముగిసిపోవడం చాలా విచారకరం. అందుకే దీన్ని బడ్జెట్ సమావేశం అనే కన్నా జమా ఖర్చుల పద్దుల మీటింగు అంటే సరిపోతుంది.

## అప్పుల కుంపట్లో ఆర్థిక వ్యవస్థ

ఈ బడ్జెట్ లో ప్రధాన పద్దులన్నీ నవరత్నాల చుట్టూ తిరిగాయి. 22 రకాల పథకాలకు రూ.48 వేల కోట్లు కేటాయిస్తున్నట్లు ప్రకటించింది. ఇందుకుగాను రానున్న సంవత్సరం మరో రూ.50 వేల కోట్లు అప్పు చేయాల్సి ఉంటుంది. ఇప్పటికే రూ.3 కోట్ల 55 వేల కోట్లు అప్పుండగా దానిపై ప్రతి సంవత్సరం రూ.23 వేల కోట్లు వడ్డీలు చెల్లిస్తున్నది. తెచ్చే అప్పులో సగం వడ్డీలకే పోతుంటే ఇక

సుస్థిరాభివృద్ధి ఎలా సాధ్యం? గత సంవత్సరం రాష్ట్ర స్థూల ఉత్పత్తి 2 పాయింట్ 6 శాతం పడిపోయింది. జాతీయస్థాయిలో 8 శాతం పడిపోగా అంతగా మెరుగ్గా ఉన్నామని అసెంబ్లీకి సమర్పించిన ఆర్థిక సర్వేలో పేర్కొన్నారు.

వ్యవసాయ రంగంలో 4 శాతం అభివృద్ధి నమోదు కాగా పారిశ్రామిక, సేవా రంగాల్లో పతనం కనిపిస్తుంది. ప్రభుత్వ ఖజానాకు పన్ను ఆదాయం రూ.300 కోట్లు తగ్గింది. ఖర్చు రూ.18 వేల కోట్లు అదనంగా పెరిగింది. ఈ బడ్జెట్లో రాష్ట్రం, కేంద్రం నుండి వచ్చేది కాక అదనంగా రూ.52 వేల కోట్లు ఆదాయం పెరుగుతుందని అంచనా. నేటి సంక్షోభంలో ఇది వాస్తవ రూపం ధరిస్తుందని భావించగలమా? ప్రజలపై అదనపు భారం మోపకుండా ఏ విధంగా సమకూర్చుకుంటుంది? ప్రభుత్వ ఆస్థులు అమ్మి ఆదాయం సమకూర్చుకోవాలన్న ఆలోచన రాష్ట్రాన్ని మరింత దివాళా తీయిస్తుంది. కేంద్రం నుండి న్యాయంగా రావాల్సిన వాటాను తెచ్చుకోడానికి, ఒత్తిడి తేవడానికి భయపడుతోంది. అప్పుడు సంక్షేమ పథకాలకు గండి పడుతుంది. ఇప్పటికే ఈ బడ్జెట్లో దళిత, గిరిజనాభివృద్ధికి, రేషను బియ్యానికి నిధులు పెరగలేదు. వ్యవసాయానికి తగ్గింది. మహిళలు, పిల్లలకు ప్రత్యేక బడ్జెట్ ప్రకటించడం ద్వారా వారి హక్కుల్ని గుర్తించినట్లయింది.

## పథకాలు మంచిదే... కరోనాలో ఊరట ఏదీ ?

ఈ పథకాల పేర్లతోనైనా ప్రజలకు నేరుగా డబ్బు చేరవేయడం మంచిదే. కరోనా మహమ్మారి జనాన్ని ముంచి వేస్తున్న సమయంలో ఆ సంక్షోభ భారాన్ని కొంతవరకైనా అధిగమించడానికి ఈ నగదు బదిలీ పథకాలు పనికి వస్తున్నాయి. కాని బడ్జెట్ అంతా దానికే పరిమితమైతే కరోనా గండాన్ని ఎదుర్కోడానికి నిధులెక్కడ నుండి వస్తాయి. అందుకే ఈ బడ్జెట్ కష్టకాలంలో ప్రజలకు భరోసా ఇచ్చేదిగా లేదు. జగన్ మోహన్ రెడ్డి గారు ముఖ్యమంత్రి అయినప్పటి నుండి తాను వాగ్దానం చేసినట్లుగా నవరత్నాల పేరుతో సంక్షేమ పథకాలకు పెద్దపీట వేశారు. కాని వాటికే పరిమితమవడం ప్రభుత్వమే ప్రకటించినట్లుగా సుస్థిర అభివృద్ధి, పేదలకు ఊరట కలిగించదు. కరోనా కష్టకాలంలో మందులు, వైద్యం ఉచితంగా లభిస్తేనే బయటపడగలుగుతారు. కానీ రాష్ట్ర ప్రభుత్వ వైద్య నిధులు 20 శాతమే పెంచింది. అది అవసరాలకు సరిపోయేది కాదు. టీకాలకే దాదాపు రూ.3 వేల కోట్లు కావాలి. ఇప్పటికే టీకాల కార్యక్రమం ఆలస్యమైంది. ఇప్పటికైనా ఆరోగ్య రంగానికి ప్రాధాన్యతనిచ్చి నిధులు కేటాయించాలి. కానీ ఈ బడ్జెట్ ప్రజలకు ఆ భరోసాను ఇవ్వలేకపోయింది. జనాన్ని కరోనా మూడు రకాలుగా వేధిస్తోంది. ఒకటి- జబ్బు వస్తుందేమోనన్న భయం, రెండు-వచ్చాక ఎలా ఎదుర్కోవాలన్న ఆందోళన, మూడు-రాకుండా చూసుకోవడం.

రాష్ట్ర బడ్జెట్లో ఇందులో ఏ ఒక్కదానికీ సమాధానం లేదు. ఎన్నికలకు ముందు పాదయాత్ర చేసి జనం గుండె చప్పుడు అర్థం చేసుకున్న జగన్ గారు ఇప్పుడు జనం గుండె చప్పుడు వినడానికే సిద్ధపడటం లేదు. పరిస్థితులను బట్టి జనం ఆలోచనలు కూడా మారుతుంటాయి. నేడు రాష్ట్రంలో ప్రతి ఒక్కరు ఈ కరోనా నుండి ఎలా బయటపడలా అని ఆలోచిస్తుంటే దాన్ని గాలికి వదిలేయడం ఏ మాత్రం సముచితంగా లేదు. అది బడ్జెట్లోనే కాదు అంతకు ముందు కూడా వ్యక్తమైంది. రెండో దశ కరోనా వ్యాపిస్తుండగానే బెడ్లు, ఆక్సిజన్, మందుల కొరత తీవ్రంగా ముంచుకొచ్చింది. దాదాపు ఇరవై రోజుల పాటు ప్రభుత్వం నుండి స్పందనే లేదు. విజయనగరంలో పది మంది రోగులు మరణించాకగానీ ప్రభుత్వం మేల్కోలేదు. ఈలోగా అన్ని జిల్లాలకూ, గ్రామాలకు ఈ రోగం వేగంగా విస్తరించింది. ఇలాంటి స్థితిలో బడ్జెట్లో కరోనాను ఎదుర్కోడానికి ప్రత్యేక ప్యాకేజి ప్రకటిస్తారని ఆశించిన జనానికి నిరాశే మిగిలింది. ముఖ్యంగా ఆశా, మున్సిపల్ వర్కర్లు, అసంఘటిత కార్మికులు, వ్యవసాయ కూలీలు బాగా నష్టపోతున్నారు. నిరుద్యోగులకు ఉపాధి దొరకడం లేదు. వివిధ రకాల పథకాల పేరుతో నిధులు కేటాయించిన ప్రభుత్వం మరో వైపు ఇప్పటికే అమల్లో వున్న అనేక పథకాలకు నిధుల కోత పెట్టింది. వ్యవసాయానికి, ఉచిత వడ్డీ పథకానికి నిధులు తగ్గించింది. హాస్టళ్లకు నిధులు లేనందువల్ల అవి మూతపడే ప్రమాదం ముంచుకొచ్చింది. ఎయిడెడ్ విద్యా సంస్థలకు సహాయం నిలిపివేయడం వల్ల అవి వ్యాపారంగా మారతాయి. పేదవారికి ఆ మాత్రం నాణ్యత కలిగిన విద్య కూడా దొరకదు. రేషను బియ్యం తీసుకోకుంటే కిలోకి తొమ్మిది రూపాయలిస్తున్నట్లు సమాచారం. ఇది భవిష్యత్తులో ఆహార భద్రతను దెబ్బ తీస్తుంది. ఇది కూడా కేంద్ర ప్రజా వ్యతిరేక చట్టాలకు అనుగుణంగా తీసుకున్న చర్యే.

## మరో విద్యా సంవత్సరం కోల్పోనున్న విద్యార్థులు

కరోనాతో విద్యార్థుల భవిష్యత్తు అగమ్యగోచరంగా మారింది. నాడు నేడు పేరుతో ప్రభుత్వ విద్యాలయాలను అందంగా తీర్చిదిద్దారు. కాని వాటిని నడిపే ఆస్కారమే లేకుండా పోయింది. ఇంటి నుండే చదువుకునే పిల్లలకు విద్య అందుబాటులో లేకుండా పోయింది. పరీక్షలు వాయిదా వేయడానికి మీనమేషాలు లెక్కించిన ప్రభుత్వం పిల్లలకు చదువును ఎలా అందుబాటు లోకి తేవాలో ఆలోచన చేయలేదు. ఈలోగా ఎన్‌సిఇఆర్‌టి సిలబస్ తెస్తాననడం, ఎయిడెడ్ స్కూళ్లకు సహాయం ఉపసంహరించుకోవడం వంటి అనాలోచిత విధానాలను పైకి తెచ్చింది. మారిన పరిస్థితులలో ప్రజల అవసరం ఒకటైతే ప్రభుత్వం చేస్తున్నది మరోటిగా ఉంది. హాస్టళ్లు మూతపడ్డాయి. దాని స్థానంలో తెచ్చిన 'విద్యా దీవెన' కరోనా కష్టంలో తల్లిదండ్రులకు ఉపశమనంగా మారొచ్చు. కానీ చదువుకునే పిల్లలకు ఎలా ఉపయోగపడుతుంది? పిల్లలున్న చోటికే చదువును తీసుకుపోయే ఎలాంటి ఆలోచనా ఈ బడ్జెట్ చేయలేదు.

### వ్యవసాయానికి గిట్టుబాటు ఏదీ ?

మన రాష్ట్ర జిడిపి కిందికి దిగినా వ్యవసాయాభివృద్ధి ఒక్కటే ముందుకు నడిచింది. ప్రకృతి సహకరించడం, రైతు కూలీల కృషి దీనికి ప్రధాన కారణం. అలాంటి వ్యవసాయ రంగానికి ఈ బడ్జెట్ నిధుల్లో కోత పెట్టింది. ఉచిత వడ్డీకి నిధి సగం తగ్గిపోయింది. అన్ని పంటలకు ధరలు పడిపోయిన స్థితిలో రైతుల్ని ఆదుకోడానికి ప్రభుత్వ జోక్యం నామకాగా మారింది. ప్రతి గ్రామంలో సచివాలయానికి అనుబంధంగా రైతు భరోసా కేంద్రాలు పెట్టారు. రైతులు తమ పంటల్ని అక్కడ రిజిస్టరు చేసుకుంటున్నారు. అంతవరకు బాగానే ఉంది. కాని పండించిన ధాన్యాన్ని ఎవరు కొంటున్నారు. రైతు భరోసా కేంద్రానికి వచ్చిన కొనుగోలు కేంద్రం ఉద్యోగి ఆ రిజిస్టరు నెంబరు గల రైతును ఆ ధాన్యాన్ని ఫలానా మిల్లుకు తీసుకుపొమ్మని చెపుతాడు. అంటే ప్రభుత్వం నిర్ణయించిన ధరకు మిల్లరు చెల్లిస్తాడని ఎవరైనా భావిస్తారు. కాని తద్భిన్నంగా మిల్లరు ధర తగ్గించి చెల్లిస్తున్నాడు. కాని రికార్డు మాత్రం మద్దతు ధర చెల్లించినట్లు రికార్డు అవుతుంది. ఎలాగంటే, ఒక రైతు వంద బస్తాలు తీసుకుపోయాడనుకోండి. బస్తా ఒకటికి మద్దతు ధర ప్రకారం రూ.1410 రావాలి. వంద బస్తాలకు రూ. 1,41,000 రావాలి. కాని బస్తా ఒకటికి మిల్లరు రూ. 1150 మాత్రమే చెల్లిస్తాడు. ఆ లెక్కన వంద బస్తాలకు రూ. 1,15,000 మాత్రమే వస్తాయి. ఈ మొత్తానికి ధాన్యం ఎన్ని బస్తాలు వస్తాయో అన్ని బస్తాలు మాత్రమే అంటే 80 బస్తాలకు లోపే వచ్చినట్లుగా మిల్లరు కొనుగోలు కేంద్రానికి రికార్డు పంపుతాడు. రైతు ఇరవై బస్తాలు నష్టపోతాడు. కాని ప్రభుత్వ రికార్డు ప్రకారం మద్దతు ధరకు రైతు నుండి కొన్నట్లు, డబ్బులు చెల్లించినట్లు ఉంటుంది. కాని మిల్లులో మిగిలిపోయిన ఇరవై బస్తాలు ప్రభుత్వ లెక్క లోకి రావు. దానికి తోడు నాణ్యత పేరుతో మరో ఐదారు కిలోలకు కోత పెడుతున్నారు. రైతు, కౌలు రైతు సంఘాల ఆందోళన తర్వాత గానీ రాష్ట్ర ప్రభుత్వం స్పందించలేదు. అదీ ఇరవై రోజుల తర్వాత. అప్పటికే రైతులు ముఖ్యంగా పేదరైతులు అధిక భాగం అమ్మేసుకున్నారు. ఇలా రైతుల నుండి నేరుగా కొనుగోలు చేయడానికి గత బడ్జెట్‌లో ధరల స్థిరీకరణ నిధికి రూ. 3 వేల కోట్లు కేటాయించారు. ఈ బడ్జెట్లో కేవలం రూ. ఐదు వందల కోట్లు మాత్రమే కేటాయించారు. గత సంవత్సరం ఖర్చయిన లోటును పూడ్చడానికే దీన్ని కేటాయించారు. అంటే రూ. 500 కోట్లు మాత్రమే ప్రభుత్వం భరించిందని అర్థం. పైకి బడ్జెట్ మూడు వేల కోట్లు. కాని ఖర్చు చేసింది రూ. 500 కోట్లు. దీన్నేమనాలి? రైతులను మోసం చేయడం కాదా? పాడి రైతులకు రూ. 4 బోనస్ ఇస్తామన్న వాగ్దానానికి నిధులు కేటాయించలేదు. పైగా వినియోగ దారులపై లీటరుకు అదనంగా 2 రూపాయల భారం మోపింది.

# హర్యానాలో రైతులపై లాఠీఛార్జీ - అరెస్టు



హర్యానాలో రైతులపై పోలీసులు మళ్లీ లాఠీఛార్జీ చేశారు. హర్యానాలోని తోహానాలో జెజెపి ఎమ్మెల్యే దేవేందర్ బాబ్లికి వ్యతిరేకంగా నిరసన తెలిపిన రైతులను పోలీసులు అరెస్టు చేశారు. తోహానాలో రైతుల అరెస్టులకు నిరసనగా హర్యానాలో రైతులు రోడ్లను దిగ్బంధించారు. హిస్సార్‌లోని మజ్రా పియావులో రోడ్డును రైతులు అడ్డుకున్నారు. జెజెపి ఎమ్మెల్యే దేవిందర్ బబ్లి రైతులను వేధించారని, రైతులపై లాఠీఛార్జీ చేయించారని రైతు నేత గురునామ్ సింగ్ చాదుని పేర్కొన్నారు. లాఠీఛార్జీకి వ్యతిరేకంగా రాష్ట్రంలో రైతులు ఆందోళనలకు పిలుపునిచ్చారు. శాంతియుతంగా నిరసన తెలిపిన రైతులపై విచక్షణా రహితంగా పోలీసులు దాడులకు పాల్పడ్డారని రైతు నేతలు విమర్శించారు. రైతులపై గూండాల మాదిరిగా రాళ్లు కూడా రువ్వారని తెలిపారు. రైతులపై లాఠీచార్జీని ఆమ్ ఆద్మీ పార్టీ రాజ్యసభ సభ్యుడు సుశీల్ గుప్తా ఖండించారు.

# మధ్యప్రదేశ్‌లో దౌర్జన్యకాండ

నల్ల వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా మధ్యప్రదేశ్‌లో కేంద్ర వ్యవసాయ మంత్రి తోమర్ కాన్వాయ్‌ని అడ్డుకున్న రైతులపై పోలీసులు విరుచుకుపడ్డారు. మధ్యప్రదేశ్‌లోని షియోపూర్‌కు మంత్రి వస్తున్న విషయం తెలుసుకున్న రైతులు సంయుక్త కిసాన్ మోర్చా ఆధ్వర్యంలో ఆందోళనకు సిద్ధమయ్యారు. దీంతో పోలీసులు పలువురు రైతు నాయకులను అరెస్టు చేసి గృహ నిర్బంధంలో ఉంచారు. అజాక్ పోలీసు స్టేషన్ సమీపంలోని పాలి రోడ్డు వద్దకు కేంద్ర మంత్రి కాన్వాయ్ రాగానే రైతులు చుట్టుముట్టారు. నల్ల జెండాలతో నిరసన ప్రదర్శన నిర్వహించారు. ఈ సందర్భంగా రైతులను దొరికిన వారిని దొరికినట్లు పోలీసులు లాఠీలతో బాదారు. అరగంట సేపు కేంద్ర మంత్రి కాన్వాయ్ నిలిచిపోయింది.

ఇంటర్వ్యూ

# ప్రతిఘటన లేనప్పుడు ప్రజాస్వామ్య ఉల్లంఘన

## ఎఐకెఎస్ సహాయ కార్యదర్శి కృష్ణ ప్రసాద్

**రైతాంగ ఉద్యమం తన కార్యక్రమాల ద్వారా గత ఆరుమాసాల్లో దేశ వ్యాపిత ఉద్యమంగా మారింది. ఉత్పత్తి వర్గాలైన కార్మికులు, కర్షకులను అది ఏకం చేసింది. తమ సమస్యలను ఒకరికొకరు స్పష్టంగా అర్థం చేసుకునేలా చేసింది. మే 26 నాటికి ఈ ఉద్యమం ఆరుమాసాలు పూర్తి చేసుకుంది. స్వతంత్రానంతర భారత దేశంలో జరిగిన అతి పెద్ద రైతాంగ తిరుగుబాటు ఇది. ఈ సందర్భంగా అఖిల భారత కిసాన్ సభ సహాయ కార్యదర్శి కృష్ణ ప్రసాద్ రైతుల తదుపరి కార్యాచరణ గురించి, ఆ పోరాట విశిష్టత గురించి న్యూస్ క్లిక్ ప్రతినిధికి వివరించారు. ఆ విశేషాలు...**



**స్వాతంత్ర్యానంతర భారతచరిత్రలో అతిపెద్ద రైతాంగ ఉద్యమంగా పేర్కొనబడుతున్న ఈ ఉద్యమం పంజాబ్, హర్యానా, రాజస్థాన్, మహారాష్ట్ర, దక్షిణ భారత్ సహా అన్ని ప్రధాన రాష్ట్రాల్లో గత ఆరు మాసాలుగా కొనసాగుతున్నది. అయినా, మీ డిమాండ్లపై ప్రభుత్వం దిగొచ్చేలా తగినంత ఒత్తిడి తేలేకపోతున్నది. ఎందుకని?**

అవును, ఇప్పుడిది దేశవ్యాపిత ఉద్యమంగా మారింది. మీరు పేర్కొన్న రాష్ట్రాల్లో రైతు సంఘాలు చాలా చురుగ్గా ఉన్నాయి. మీ ప్రశ్నకు సమాధానంగా నేను రెండు అంశాలను వివరించాల్సి వుంది. మొదటిది, ఈ ఉద్యమం దశల వారీగా నిర్మించబడుతూ వచ్చింది. చేపట్టే ఒక్కో ఆందోళనా కార్యక్రమం ద్వారా అది తన బలాన్ని పెంచుకుంటున్నది. ఈ ఆరు నెలల పోరాట కాలంలో డిసెంబరు 8, జనవరి 8, మార్చి 26 తేదీల్లో కార్మిక సంఘాలు, రెండు రైతు సంఘాలు కలసి మూడు 'భారత్ బంద్'లను నిర్వహించాయి. అదే సమయంలో ఈ ఏడాది ఫిబ్రవరి 8న రైలు రోకో నిర్వహించాము. దాంతో రైళ్ల రాకపోకలు స్తంభించాయి. ఈ ఆందోళనా కార్యక్రమాలన్నీ ఉత్పత్తి వర్గాలైన కార్మికులు, కర్షకులు కలసికట్టుగా చేపట్టినవే. దీని ద్వారా తమ సమస్యలను ఒకరికొకరు స్పష్టంగా అర్థం చేసుకోవడానికి, తమ మధ్య మైత్రీ బంధం మరింత పటిష్టవంతం కావడానికి వుపయోగపడింది. పంజాబ్, హర్యానా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల్లో ఉద్యమం స్వభావ రీత్యా ప్రజా ఉద్యమంగా మారడం, బలంగా ఉండడం వల్లే ఇది సాధ్యమైంది.

వ్యవసాయక సంబంధాల్లో గణనీయమైన మార్పులు చోటు చేసుకున్నందున ఈ తరహా పరిస్థితులను దేశమంతటా ఒకేలా వర్తింపజేయడం కుదరదు. ఉదాహరణకు కేరళలో పరిస్థితినే తీసుకుందాం. నేను ఆ రాష్ట్రానికి చెందిన వాణ్ణి కాబట్టి అక్కడి వ్యవసాయ పరిస్థితి గురించి కొన్ని ముఖ్యమైన అంశాలను తెలియజేస్తాను. కేరళలో పండించే మొత్తం పంటల్లో 82 శాతం దాకా కాఫీ, రబ్బర్, మిరియాలు, కొబ్బరి, జీడిపప్పు వంటి వాణిజ్య పంటలే ఉంటాయి. ఉత్తరాది రాష్ట్రాలతో పోల్చితే కేరళ వ్యవసాయ ఆర్థికవ్యవస్థపై ఈ చట్టాల ప్రభావం అంతగా ఉండదు. అయితే, ఈ రైతులు ఆసియాన్, తదితర ఒప్పందాల వల్ల ఎక్కువ దోపిడీకి గురవుతున్నారు. ఆసియాన్ ఒప్పందానికి ముందు కేరళ ఏటా ఏడు లక్షల టన్నుల రబ్బర్ ఉత్పత్తి చేసేది. రబ్బర్ కిలో ఒక్కింటికి రూ. 240 ధర పలికేది. ఆ ఒప్పందం అమల్లోకి వచ్చాక అది అమాంతంగా రూ. 70కి పడిపోయింది. ఇప్పుడు అది కిలో రూ. 130 వద్ద ఉన్నది. ఈ ప్రకారం లెక్కిస్తే రైతులకు ఏడాదికి రూ. 11,400 కోట్ల నష్టం వాటిల్లింది. ఇతర పంటలకు వచ్చే నష్టాన్ని కూడా కలుపుకుంటే ఏడాదికి ఒక్కో రైతుకు రూ. 60,000 నష్టం వస్తున్నది. కాబట్టి ఈ సంబంధాలు, సమస్యలను కూడా పరిగణనలోకి తీసుకోవాల్సి వుంటుంది. మేము ఈ అంశాన్ని కూడా పరిశీలిస్తున్నాం. ఈ చట్టాలు తమ సమస్యలను పట్టించుకోలేదనే ఆందోళన వివిధ ప్రాంతాలకు చెందిన రైతులందరిలోను రానిదే అందరినీ కలుపుకురావడం అంత తేలికేమీ కాదు. దీనిపైనా మేము దృష్టి పెట్టాం. ఈ ప్రాంతాల్లోను ప్రజా ఉద్యమంగా దీనిని మార్చడమెలా అన్నదాని గురించి ఆలోచిస్తున్నాం. ఈ పోరాటం కేంద్ర-రాష్ట్ర సంబంధాల్లోనూ మార్పులు తెస్తుంది. ప్రధాని నరేంద్ర మోడీ 'ఒక దేశం ఒకే మార్కెట్' అన్న పేరుతో తీసుకొచ్చిన ఈ చట్టాలు ఎవరికి మేలు చేకూర్చుతున్నాయి? కార్పొరేట్ల కోసమే వీటిని తీసుకొచ్చారన్నది స్పష్టం. ఏ రైతు తన పంటను 200 కిలోమీటర్ల దూరం వెళ్లి అమ్ముకోలేరు. వ్యవసాయం రాష్ట్ర జాబితాలోని అంశం. గనుక దీనిపై ఒక వైఖరి తీసుకోవాలని

రాష్ట్రాల ముఖ్యమంత్రులను కూడా మేము అడుగుతున్నాం.

ప్రభుత్వం ఎందుకు మా డిమాండ్లను అంగీకరించడం లేదు అని మీరడిగారు. ఇక్కడ మీరు ఒక విషయం అర్థం చేసుకోవాలి. ఇది విధానపరమైన అంశానికి సంబంధించింది. ఆయన (మోడీ) కార్పొరేట్లకు ఒక మస్కట్ లాంటివారు. కార్పొరేట్లు దీనిపై ఒక్క అడుగు కూడా వెనక్కి వెళ్లేందుకు సిద్ధంగా లేరు. అందుకే ప్రభుత్వం కూడా దీనిపై వెనక్కి వెళ్లేందుకు నిరాకరిస్తోంది. గత మూడు దశాబ్దాలుగా అనుసరించిన పెట్టుబడిదారీ, నయా ఉదారవాద విధానాలే ఈ సంక్షోభాన్ని సృష్టించాయి. ఆ సంక్షోభంలో వారు ఇప్పుడు చిక్కుకున్నారు. ప్రభుత్వాలు ముప్పయ్యేళ్లుగా అనుసరిస్తూ వస్తున్న ఈ విధానాల వల్ల ఉత్పత్తి వర్గాలైన కార్మికులు, కర్షకుల చేతిలో కొనుగోలుశక్తి పడిపోయింది. వస్తువులను కొనుగోలు చేసే శక్తి వారి దగ్గర సన్నగిల్లినప్పుడు కార్పొరేట్ సంస్థలు ఎలా మనగలుగుతాయి? అందుకోసం అవి తమ దోపిడీని మరింత తీవ్రతరం చేస్తాయి. కాబట్టి ఈ సంక్షోభం పరిష్కారం కావాలంటే ఈ విధానాలను సమీక్షించాల్సిన అవసరం ఉంది. అందుకు తగిన ప్రతిఘటనను నిర్మించాల్సి ఉంది.

**రైతాంగ ఉద్యమం సాంప్రదాయకంగా బలంగా ఉండి, ప్రతిఘటన అంతగా లేని మధ్యభారత రాష్ట్రాల్లో మెరుగైన పోరాటాలు సాగించే విషయం గురించి మీరు ఆలోచిస్తున్నారా?**

ఈ రాష్ట్రాల్లో భారతీయ జనతా పార్టీ రాజకీయంగా సంఘటితమై ఉన్నదనే విషయం తెలుసు. ఈ ఉద్యమం చత్తీస్‌గఢ్, మధ్య ప్రదేశ్ వంటి రాష్ట్రాలపై మంచి ప్రభావం చూపింది. గుణ, గ్వాలియర్, చింద్వారాలో రైతులు వీధుల్లోకి వచ్చి పోరాడారు.

**ఇంత వరకు రైతాంగ ఉద్యమం గురించి మాట్లాడుకున్నాం. ఈ ఉద్యమం ఇచ్చిన స్ఫూర్తి గురించి కొంచెం వివరిస్తారా?**

ఈ ఉద్యమం సందర్భంగా పంజాబ్ సోదర సోదరీమణులు అందించిన తోడ్పాటు మరువరానిది. వారు ఈ సమస్యలను లోతుగా అధ్యయనం చేశారు. అద్భుతమైన త్యాగాలు చేశారు. నిరసనకారులకు అవసరమైన ఆహారాన్ని ఉచితంగా అందించారు. ఉద్యమం గట్టిగా నిలదొక్కుకోడానికి అది ఎంతగానో తోడ్పడింది. ఇంత పెద్దయెత్తున ఉద్యమం సాగినా, ఎక్కడా ఎటువంటి హింసాత్మక ఘటనలు చోటు చేసుకోకపోవడం, ప్రభుత్వం కూడా దీనిని అణచివేసే దుస్సాహసానికి తెగబడడానికి వెనకాడాల్సి వచ్చిందంటే ఈ రైతు ఉద్యమం ప్రజా ఉద్యమ రూపం సంతరించుకోవడమే కారణం. అయితే, అలా అని ప్రభుత్వం చేతులు ముడుచుకుకూర్చోలేదు. రైతులు ఉద్యమాన్ని అడ్డుకోవడానికి రోడ్లపై కందకాలు తవ్వడం, జల ఫిరంగులను ప్రయోగించడం వంటి నిర్బంధ చర్యలకు అది పాల్పడింది. ప్రతిఘటన లేనప్పుడు ప్రజాస్వామ్యం ఉల్లంఘించబడుతుంది. రైతులు ఈ విషయాన్ని అర్థం చేసుకున్నారు. ఇదీ ఈ ఉద్యమం అందించిన గొప్ప స్ఫూర్తి. నిర్బంధాన్ని నిర్భయంగా, వీరోచితంగా ఎదుర్కోవడమెలాగో రైతులకు ఈ ఉద్యమం నేర్పింది. ఇంకో గొప్ప స్ఫూర్తిదాయకమైన విషయం కార్మికులు, కర్షకుల మధ్య ఐక్యత. గత ఏడాది నవంబరు 26న కార్మికుల సమ్మెతో బాటే మా పోరాటం మొదలైంది.

**మూడు వ్యవసాయ చట్టాలకే ఈ పోరాటం పరిమితమా, ఇతర అంశాలపైనా కేంద్రీకరిస్తుందా?**

వ్యవసాయం ఇప్పుడు నష్టదాయకంగా మారింది. రైతులు అగ్రి బిజినెస్ కంపెనీలకు ముడి సరుకును ఉత్పత్తి చేసి విక్రయించే వారిగా తయారయ్యారు. ఈ కంపెనీలు వారికి న్యాయమైన ధర చెల్లించకుండా ముంచేస్తున్నాయి. 1998-99లో కాఫీగింజలు కిలో రూ.100కు అమ్ముడయ్యేవి, కిలో కాఫీ పొడి తయారీకి 2.5 కిలోల కాఫీ గింజలు అవసరం. స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం వచ్చాక కాఫీ గింజల ధర కిలో రూ. 60కి పడిపోయింది. ఆ మేరకు నెస్లె వంటి కాఫీ కంపెనీలు తమ కాఫీ పొడి ధరను కూడా తగ్గించాలి. కానీ, అందుకు భిన్నంగా కాఫీ పొడి ధర కిలో రూ. 900-రూ. 2,400కి పెరిగింది. వారి లాభాలు తగ్గలేదు. పారిశ్రామిక వేత్తలు, మధ్య దళారీలు, రవాణాదారులు అందరూ లాభపడ్డారు. రైతులు మాత్రం నష్టపోతున్నారు. అందుకే రైతు పెట్టిన మొత్తం పెట్టుబడి ఖర్చులకు 50 శాతం లాభం అదనంగా కలిపి వ్యవసాయోత్పత్తుల కనీస మద్దతు ధర నిర్ణయించాలన్న స్వామినాథన్ కమిషన్ సిఫారసులను అమలు చేయాలని కోరుతున్నాం. బిజెపి పెట్టుబడిదారీ పార్టీ. ఇది ఆ పని చేయదు. అందుకే ఈ ప్రభుత్వాన్ని మార్చి లెఫ్ట్, డెమొక్రటిక్ ప్రభుత్వాన్ని తీసుకురావాల్సిన అవసరం ఉంది.



# ఢిల్లీ నుంచి గల్లీ వరకూ 'బ్లాక్ డే'

**• లక్షకు పైగా ప్రాంతాల్లో నిరసనలు • ఎస్‌కెఎం పిలుపుకు విశేష స్పందన**

మోడీ ప్రభుత్వం తీసుకొచ్చిన మూడు వ్యవసాయ చట్టాలను రద్దు చేయాలని, కనీస మద్దతు ధర(ఎంఎస్‌పి )కు చట్టబద్ధత కల్పించాలని, విద్యుత్ సవరణ బిల్లును ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేస్తూ, మే 26న దేశవ్యాప్తంగా చేపట్టిన "బ్లాక్ డే" విజయవంతమైంది. దేశ రాజధాని ఢిల్లీ సరిహద్దుల్లో లక్షలాది మంది రైతులు చేస్తున్న ఉద్యమం ప్రారంభమై మే 26 నాటికి ఆరు నెలలైంది. కేంద్రంలో మోడీ ప్రభుత్వం ఏర్పడి ఏడేళ్లయింది. ఈ సందర్భంగా 'బ్లాక్ డే' గా నిర్వహించాలని సంయుక్త కిసాన్ మోర్చా ఇచ్చిన పిలుపునకు దేశవ్యాప్తంగా విశేష స్పందన లభించింది. ఢిల్లీ నుంచి గల్లీ వరకు నల్ల జెండాలతో నిరసనలు హోరెత్తాయి. ఇళ్లపైన, కార్యాలయాలపైన, వాహనాలకు నల్ల జెండాలు ఎగురవేసి నిరసనలు తెలిపారు. నల్ల రిబ్బన్లు పెట్టుకొని, ఆందోళనలు చేపట్టారు. ప్రధాని మోడీ దిష్టి బొమ్మలను దగ్ధం చేశారు. ఎస్‌కెఎం 'బ్లాక్ డే' పిలుపునకు కార్మిక, వ్యవసాయ కార్మిక, విద్యార్థి, యువజన, మహిళ, దళిత, ఉద్యోగ సంఘాలు మద్దతు తెలిపాయి. రాజకీయ పార్టీలు సంఘీభావం తెలిపాయి. రైతులతోపాటు ఆయా సంఘాల కార్యకర్తలు, రాజకీయ పార్టీల కార్యకర్తలు నిరసనల్లో పాల్గొన్నారు.

### ఢిల్లీ సరిహద్దుల్లో...

ఢిల్లీ సరిహద్దులు సింఘూ, టిక్రీ, ఘాజీపూర్, షాజహాన్పూర్, పల్వాల్ బోర్డర్‌లో "బ్లాక్ డే" సంపూర్ణంగా జరిగింది. ట్రాక్టర్లు, ట్రాలీలు, గుడారాలపై నల్ల జెండాలు ఎగురవేస్తూ, మోడీ దిష్టి బొమ్మలను దగ్ధం చేశారు. ప్రజలు తమ ఇళ్లు, ట్రాక్టర్లు, ఇతర వాహనాలపై నల్ల జెండాలు ఎగురవేసి రైతులకు సంఘీభావం చెప్పారు. సింఘూ బోర్డర్‌లో తమ గుడారాలు, ట్రాలీలు, కార్లు, ట్రాక్టర్లు, తాత్కాలిక నిర్మాణాలపై నల్ల జెండాలను ఎగురవేశారు. అనేక ప్రదేశాల్లో మోడీ దిష్టిబొమ్మలతో శవయాత్ర నిర్వహించి, వాటిని దగ్ధం చేశారు. నిరసన స్థలానికి వేలాది మంది తిరిగి చేరుకోవడంతో టిక్రీ బోర్డర్ కూడా బలపడింది.



స్థానిక ప్రజలు కూడా నిరసనకారులకు సంఘీభావం తెలిపారు. ఘాజీపూర్ సరిహద్దు వద్దకు ఉత్తర ప్రదేశ్, ఉత్తరాఖండ్, హిమాచల్ ప్రదేశ్ నుంచి అధిక సంఖ్యలో చేరుకున్నారు. షాజహాన్పూర్ వద్ద హర్యానా, రాజస్థాన్ రైతులు కలిసి కిసాన్ మోర్చాను బలోపేతం చేయాలని సంకల్పించారు. బ్లాక్ డే పిలుపు నేపథ్యంలో 26 ఉదయం నుంచి ఢిల్లీ సరిహద్దుల్లో పోలీసులు గస్తీని ముమ్మరం చేశారు. బ్లాక్ డేను విజయవంతం చేసినందుకు రైతులు, కార్మికులు, వ్యవసాయ కార్మికులు, విద్యార్థులు, యువత, మహిళలు, ఉద్యోగులు, రాజకీయ పార్టీల కార్యకర్తలకు సంయుక్త కిసాన్ మోర్చా ధన్యవాదాలు తెలిపింది.

### వివిధ రాష్ట్రాల్లో

ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, తమిళనాడు, కేరళ, మహారాష్ట్ర, పంజాబ్, హర్యానా, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, హిమాచల్ ప్రదేశ్, జమ్ము కాశ్మీర్, ఢిల్లీ, త్రిపుర, అస్సాం, ఉత్తరాఖండ్, జార్ఖండ్, గుజరాత్, పుదుచ్చేరి, బీహార్, గోవా, లక్షదీవ్ తదితర రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాల్లో "బ్లాక్ డే" సంపూర్ణంగా జరిగింది. ఈశాన్య రాష్ట్రాల్లో నిరసనలు పెద్ద ఎత్తున జరిగాయి. యాస్ తుపాను అతలాకుతలం చేసినప్పటికీ ఒరిస్సా, పశ్చిమ బెంగాల్‌లో బ్లాక్ డే నిరసనలు జరిగాయి. దేశవ్యాప్తంగా లక్షకు పైగా ప్రాంతాల్లో నిరసనలు జరిగాయి.

### డిమాండ్లన్నీ నెరవేరేవరకూ ఉద్యమం : ఎస్‌కెఎం

దేశవ్యాప్తంగా ప్రజలు రైతులకు సంఘీభావం తెలుపుతూ కేంద్రంలోని బిజెపి ప్రభుత్వంపై ఆగ్రహం వ్యక్తం చేశారని సంయుక్త కిసాన్ మోర్చా నేతలు బల్బీర్ సింగ్ రాజేవాల్, దర్శన్ పాల్, గుర్నమ్ సింగ్ చారుని, హన్నన్ మొల్లా, జగ్జిత్ సింగ్ దల్లెవాల్, జోగిందర్ సింగ్ ఉగ్రహాన్, యుధ్వీర్ సింగ్, యోగేంద్ర యాదవ్, అభిమన్యు కోహాడ్ పేర్కొన్నారు. డిమాండ్లు పూర్తిగా నెరవేరే వరకు రైతులు ఆందోళన నుండి వెనక్కి తగ్గరని మోడీ ప్రభుత్వాన్ని హెచ్చరించారు. ఢిల్లీలోని ఎఐకెఎస్ కార్యాలయంలో నల్ల జెండాలు ప్రదర్శించి, మోడీ దిష్టి బొమ్మను దగ్ధం చేశారు. ఈ కార్యక్రమంలో ఎఐకెఎస్ అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు అశోక్ ధావలే, హన్నన్ మొల్లా, సంయుక్త కార్యదర్శి విజూ కృష్ణన్, ఆర్థిక కార్యదర్శి పి కృష్ణ ప్రసాద్, సిఐటియు కార్యదర్శి ఎఆర్ సింధు, ఎఐఎడబ్ల్యుయు సంయుక్త కార్యదర్శి విక్రమ్ సింగ్, ఐద్వా ప్రధాన కార్యదర్శి మరియం ధావలే, సహాయ కార్యదర్శి ఆశా శర్మ, కేంద్ర కమిటీ సభ్యురాలు మెమునా మొల్లా, అర్చన ప్రసాద్, ఎస్ఎఫ్ఐ సహాయ కార్యదర్శి ధనిత్ ధెంటా, పిఎస్ఎం నాయకుడు దినేష్ అబ్రోల్ తదితరులు పాల్గొన్నారు. సిపిఐ ప్రధాన కార్యాలయం వద్ద ఆ పార్టీ ప్రధాన కార్యదర్శి డి. రాజా ఆధ్వర్యాన నల్ల జెండాలతో

నిరసన తెలిపారు. రైతు వ్యతిరేక చట్టాలు రద్దు చేయాలని, రైతులతో చర్చలు పున్నప్రారం భించాలని నినాదాలు చేశారు.




**ఎంతకాలమైనా ఆందోళనలు : రాకేష్ తికాయత్**

మూడు సాగు చట్టాలను రద్దు చేసి, రైతులకు కనీస మద్దతు ధర లభించేలా చూడటమన్నదే తమ ఏకైక డిమాండ్ అని భారతీయ కిసాన్ యూనియన్ ప్రతినిధి రాకేష్ తికాయత్ తెలిపారు. ఆ డిమాండ్ నెరవేరే వరకూ ఎంతకాలమైనా సరే నిరసనలు కొనసాగిస్తూనే ఉంటామని ఆయన పేర్కొన్నారు. తమ ఉద్యమానికి ప్రజల నుంచి సంపూర్ణ మద్దతు లభిస్తోందని తెలిపారు. కరోనా ప్రోటోకాల్‌కు అనుగుణంగా శాంతియుతంగా ఆందోళనలు తెలిపినట్లు చెప్పారు.

**రాష్ట్ర వ్యాప్తంగా నిరసనలు**

కార్పొరేటర్లకు ప్రయోజనం చేకూర్చేందుకు తీసుకొచ్చిన మూడు వ్యవసాయ చట్టాలను రద్దు చేయాలని, విద్యుత్తు సవరణ బిల్లును ఉపసంహరించాలని డిమాండ్ చేస్తూ మే 26న రాష్ట్ర వ్యాప్తంగా ఆందోళనలు జరిగాయి. కృష్ణా జిల్లా విజయవాడ హనుమాన్‌పేట, గుంటూరు జిల్లా తాడేపల్లి పట్టణం, తాడేపల్లి మండలం వడ్డేశ్వరం బైపాస్ వద్ద బ్లాక్ డే నిరసనల్లో ఏపి కౌలు రైతు సంఘం ఉపాధ్యక్షులు వి.శ్రీనివాసరావు మాట్లాడుతూ రైతాంగం నడ్డి విరిచే మూడు వ్యవసాయ నల్ల చట్టాలను కేంద్ర ఉపసంహరించుకొనే వరకూ ఉద్యమం కొనసాగుతుందని స్పష్టం చేశారు. వడ్డేశ్వరంలో జరిగిన కార్యక్రమంలో ఏపి కౌలు రైతు సంఘం రాష్ట్ర కార్యదర్శి పి.జమలయ్య, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం అధ్యక్షులు దడాల సుబ్బారావు, రాష్ట్ర కార్యదర్శి వి.వెంకటేశ్వర్లు, ఎస్ఎఫ్ఐ రాష్ట్ర అధ్యక్షులు ప్రసన్న, ప్రజానాట్య మండలి రాష్ట్ర కార్యదర్శి అనిల్ పాల్గొన్నారు. పెదకాకానిలో ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి.రమాదేవి పాల్గొని ప్రసంగించారు. కృష్ణా జిల్లాలో 35 కేంద్రాల్లో నిరసన కార్యక్రమాలు నిర్వహించారు. విజయవాడలో జరిగిన కార్యక్రమంలో రైతు సంఘం రాష్ట్ర నాయకులు రావుల వెంకయ్య, ఐఎఫ్‌టియు రాష్ట్ర అధ్యక్షులు పి.ప్రసాదరావు, వ్యవసాయ కార్మిక సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వి.వెంకటేశ్వర్లు పాల్గొన్నారు. ఉయ్యూరులో నిరసనలో మాజీ మంత్రి, రైతు సంఘాల సమాఖ్య రాష్ట్ర కన్వీనర్ వడ్డే శోభనాద్రీశ్వరరావు పాల్గొని ప్రసంగించారు. మోడీ ప్రభుత్వం వెంటనే స్పందించాలని డిమాండ్ చేశారు. ప్రకాశం జిల్లా ఒంగోలులో కలెక్టరేట్ వద్ద మోడీ దిష్టిబొమ్మను దహనం చేశారు. పామూరులో మోడీ దిష్టిబమ్మను ప్రజాసంఘాల నాయకులు దహనం చేస్తుండగా, పోలీసులు అడ్డుకొని, 20 మందిని అరెస్టు చేశారు. అనంతరం సొంత పూచీకత్తుపై విడుదల చేశారు. విశాఖలోని జివిఎంసి గాంధీ విగ్రహం వద్ద కార్మిక ప్రజా సంఘాల జెఎసి ఆధ్వర్యాన చేపట్టిన నిరసనలో సిఐటియు రాష్ట్ర అధ్యక్షులు సిహెచ్.నర్సింగరావు మాట్లాడారు. నగరంలోనూ, జిల్లాలోనూ పలుచోట్ల నిరసనలు తెలిపారు. పశ్చిమగోదావరి జిల్లా ఏలూరులోని సిఐటియు జిల్లా కార్యాలయం వద్ద నిరసన కార్యక్రమంలో ఉభయ గోదావరి జిల్లాల ఉపాధ్యాయ ఎమ్మెల్సీ షేక్ సాబ్జీ మాట్లాడారు. నరసాపురంలో నిరసన చేపట్టారు. కర్నూలులో కలెక్టరేట్ ముందు నల్లజెండాలతో నిరసన తెలిపారు. బ్లాక్ డే పిలుపునకు శ్రీకాకుళం జిల్లాలో స్పందన లభించింది. నెల్లూరు జిల్లాలో నెల్లూరుతో పాటు జిల్లాలో పలుచోట్ల నిరసనలు తెలిపారు. విజయనగరం కలెక్టరేట్ వద్ద ధర్నా నిర్వహించారు. రైతులకు మద్దతుగా జిల్లా వ్యాప్తంగా యుటిఎఫ్ ఆధ్వర్యాన ఉపాధ్యాయులు తమ ఇళ్ల వద్ద ప్లకార్డులు ప్రదర్శించి నిరసన తెలిపారు. అనంతపురం జిల్లా వ్యాప్తంగా ప్రజా సంఘాల ఆధ్వర్యంలో బ్లాక్‌డే నిరసన కార్యక్రమాలను చేపట్టారు. అన్ని మండల కేంద్రాల్లోనూ నల్లజెండాలతో ఆందోళన నిర్వహించారు. తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో జరిగిన నిరసనలో సిఐటియు జాతీయ ఉపాధ్యక్షులు జి.బేబిరాణి, ఐఎఫ్‌టియు రాష్ట్ర కార్యదర్శి జె.వెంకటేశ్వరరావు, ఐఎన్‌టియుసి రాష్ట్ర ఆర్గనైజింగ్ సెక్రటరీ తాళ్లూరి రాజు పాల్గొని మాట్లాడారు. ఆర్‌టిసి బస్ కాంప్లెక్స్ వద్ద సిపిఎం ఆధ్వర్యంలో, రాజమహేంద్రవరంలో ఎఐటియుసి, సిఐటియు ఆధ్వర్యంలో నల్ల జెండాలతో నిరసన తెలిపారు. కడప జిల్లా వేంపల్లెలో పిసిసి వర్కింగ్ ప్రెసిడెంట్ తులసిరెడ్డి కాంగ్రెస్ కార్యకర్తలతో కలిసి నల్ల బ్యాడ్జీలు ధరించి కేంద్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. కడప పాత బస్టాండ్‌లో చేపట్టిన నిరసనలో ఏపి రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు బి.నారాయణ పాల్గొని ప్రసంగించారు. బద్వేలులో ప్రజాసంఘాల ఐక్యవేదిక ఆధ్వర్యంలో ప్రజా సంఘాల నాయకులు నల్ల రిబ్బన్లతో కళ్లకు గంతలు కట్టుకొని నిరసన తెలిపారు. చిత్తూరు జిల్లా తిరుపతిలో టవర్ క్లాక్ వద్ద సిపిఐ ఆధ్వర్యాన నల్లజెండాలు, కండువాలతో నిరసన తెలిపారు. ఈ సందర్భంగా ఆ పార్టీ జాతీయ కార్యదర్శి నారాయణ మాట్లాడారు. తిరుపతి కార్పొరేషన్ కార్యాలయం వద్ద కూడా నిరసన తెలిపారు. చిత్తూరులో నల్లజెండా ఎగురవేశారు. శ్రీకాళహస్తిలో వ్యవసాయ కార్మిక సంఘం ఆధ్వర్యాన మోడీ దిష్టిబొమ్మను దహనం చేశారు. ✱

# కార్పొరేట్ల బారి నుండి వ్యవసాయాన్ని కాపాడుకుందాం




వడ్డే శోభనాద్రీశ్వరరావు

లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ్ (జెపి) 1974లో "సంపూర్ణ విప్లవం" కోసం పిలుపునిచ్చారు. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని సంయుక్త కిసాన్ మోర్చా నేడు దేశవ్యాప్తంగా "కార్పొరేట్ల బారి నుండి దేశాన్ని కాపాడుకుందాం" అన్న పిలుపు నిచ్చింది. భారత వ్యవసాయ రంగానికి ఉరితాళ్ళ వంటి మూడు నల్ల వ్యవసాయ చట్టాల ప్రతులను, విద్యుత్ బిల్-2020 ప్రతులను గ్రామ గ్రామానా జూన్ 5న తగులబెట్టాలన్న కార్యక్రమం 500 రైతు సంఘాల ఐక్యవేదిక ఆధ్వర్యంలో దేశమంతటా జరిగింది.

నాటి కేంద్ర కాంగ్రెస్ ప్రభుత్వ అవినీతి, అప్రజాస్వామిక-ప్రజా వ్యతిరేక విధానాలను నిరసిస్తూ ప్రముఖ గాంధేయ సామ్యవాది జయప్రకాష్ నారాయణ్ సారథ్యంలో 1974లో చారిత్రాత్మక ఉద్యమం సాగింది. నాటి ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ నిరంకుశంగా ప్రతిపక్ష నేతలను, కార్యకర్తలను వేలాదిగా నిర్బంధించారు. పైగా అత్యవసర పరిస్థితిని విధించి పౌరుల ప్రాథమిక హక్కులను సైతం రద్దు చేశారు. ఆనాటి ఉద్యమం రగిల్చిన చైతన్యంతో 1977 సార్వత్రిక ఎన్నికల్లో నిరంకుశ కాంగ్రెస్ ప్రభుత్వాన్ని చిత్తుగా ప్రజలు ఓడించారు. అప్పుడు ఏర్పడిన జనతా ప్రభుత్వం పౌరహక్కులను పునరుద్ధరించడంతో పాటు రైతులు, సామాన్య ప్రజల అభివృద్ధి కోసం కొన్ని నిర్ణయాలను అమలు చేసింది. నాటి ఉద్యమంలో ప్రధానమైన పాత్ర యువతది, కాగా నాయకుడు జయప్రకాష్ నారాయణ్.

నేడు దేశ వ్యాప్తంగా కోట్లాది మంది రైతులు దశాబ్దాలుగా కొనసాగుతున్న ప్రభుత్వ విధానాలతో సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నారు. నరేంద్ర మోడీ ప్రభుత్వం తెచ్చిన మూడు నల్ల వ్యవసాయ చట్టాలు వారి పరిస్థితిని "పెనం మీంచి పొయ్యి లోకి" నెట్టాయి. ఆ నల్ల చట్టాలకు విద్యుత్ బిల్లు-2020 తోడైంది. వీటికి వ్యతిరేకంగా నవంబర్ 26, 2020 నుండి కొనసాగుతున్న రైతాంగ ఉద్యమం స్వతంత్ర భారతావనిలో రెండవ అతి పెద్ద ఉద్యమంగా చెప్పవచ్చు. ఈ ఉద్యమంలో ప్రధాన పాత్రధారులు రైతులు, కౌలు రైతులు, వ్యవసాయ కార్మికులు, పారిశ్రామిక కార్మికులు, ఉద్యోగ వర్గాల నాయకత్వం సమిష్టిగా 500 రైతు సంఘాల నాయకులతో కూడిన సంయుక్త కిసాన్ మోర్చా.

గుజరాత్‌లో చిమన్ భాయి పటేల్ ప్రభుత్వ అవినీతిని ప్రశ్నిస్తూ, శాసనసభ రద్దు డిమాండ్‌తో జె.పి. నాయకత్వంలో ఉద్యమం ప్రారంభమైంది. తదుపరి బీహార్‌లో ప్రభుత్వ అవినీతిపై పోరాడుతున్న విద్యార్థుల పైన పోలీసుల పైశాచిక దాడులకు వ్యతిరేకంగా వెల్లువెత్తిన నిరసనలు ఉద్యమాన్ని తీవ్రతరం చేశాయి. జూన్ 5, 1974న పాట్నాలో చారిత్రాత్మక గాంధీ మైదాన్ ర్యాలీలో జె.పి. "సంపూర్ణ విప్లవం" పిలుపునిచ్చారు. ఉద్యమ లక్ష్యం నెరవేరే వరకూ దీర్ఘకాల పోరాటాలకు, త్యాగాలకు సిద్ధం కావాలని జె.పి ఉద్బోధించారు. మళ్ళీ ఇప్పుడు రైతాంగం అదే స్ఫూర్తితో ఉద్యమం చేపట్టింది. 2018 లోనే 200 పైచిలుకు రైతు సంఘాలు "ఆల్ ఇండియా కిసాన్ సంఘర్ష్ కోఆర్డినేషన్ కమిటీ" సారథ్యంలో న్యూఢిల్లీ లోని పార్లమెంట్ స్ట్రీట్‌లో చాలా పెద్ద సభను ఏర్పాటు చేశాయి. ఎమ్.ఎస్. స్వామినాథన్ కమిషన్ సిఫార్సులను వెంటనే అమలు చేయాలని, రైతులకు రుణమాఫీ చెయ్యాలని, రైతుల ఆత్మహత్యల పరంపరకు అడ్డువేసేందుకు కేరళ రాష్ట్రంలో అమలవుతున్న "రుణ ఉపశమన చట్టం" వంటి దానిని కేంద్రం తీసుకురావాలని డిమాండ్ చేసినా మోడీ ప్రభుత్వం పెడచెవిన పెట్టింది.

కేంద్ర వ్యవసాయ మంత్రి రాధామోహన్ సింగ్ కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలను సంప్రదించి మోడల్ ఎ.పి.యం.సి. యాక్ట్, మోడల్ కాంట్రాక్ట్ ఫార్మింగ్ యాక్ట్ 2018లను రూపొందించారు. వాటిని అమలు చేసే రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక ప్రోత్సాహక నిధులను అందచేయగలదని, ఆ నిధులతో వ్యవసాయ మార్కెట్లలో మౌలిక వసతులను మరింత మెరుగుపరుచుకోవచ్చని ఆర్థిక మంత్రి ఫిబ్రవరి 2, 2020న బడ్జెట్ ప్రసంగంలో స్పష్టంగా ప్రకటించారు. అయితే, కోవిడ్ మహమ్మారి విలయతాండవం చేస్తూ, లాక్‌డౌన్ కఠిన ఆంక్షలతో ప్రజలు, పలు విధాల నష్టపోతున్న విపత్కర పరిస్థితులను అదునుగా భావించి గౌతమ్ అదాని ఆఫీస్‌లో రూపొందించిన విద్యుత్ బిల్ 2020 ఆర్డినెన్స్‌ను ఏప్రియల్ 2020లో కేంద్ర ప్రభుత్వం అకస్మాత్తుగా ప్రకటించింది. దరిమిలా జూన్ 3, 2020న మూడు నల్ల వ్యవసాయ చట్టాల ఆర్డినెన్స్‌లను ప్రకటించింది. సెప్టెంబర్ 2020లో రాజ్యసభలో మెజారిటీ సభ్యులు ఆ బిల్లులను సెలక్ట్ కమిటీకి నివేదించాలని పట్టుబట్టినప్పటికి, ఓటింగ్ నిర్వహించాలని కోరినప్పటికి పెడచెవిన పెట్టి ఆమోదించినట్టు ప్రకటించుకున్నారు. కొన్ని లోపాలు ఉన్నప్పటికి కొంతమేరకైనా రైతాంగానికి ఉపయోగపడుతున్న వ్యవసాయ మార్కెట్ యార్డుల వ్యవస్థను పూర్తిగా నిర్వీర్యం చేసి రిలయన్స్ రిటైల్, డీమార్ట్, మోర్, మెట్రో, అదాని ఫార్చ్యూన్, మెట్రో తదితర కార్పొరేట్ దిగ్గజాలకు రైతాంగ ప్రయోజనాలను బలిపెట్టడం ఈ బిల్లుల లక్ష్యం. మూడు నల్ల వ్యవసాయ చట్టాల వలన కార్పొరేట్లకు అత్యధికంగా లాభాలు చేకూరడం, రైతులు అతి తక్కువ ధరలకు తమ ఉత్పత్తులను అతి తక్కువ ధరలకు అమ్ముకోవలసి రావడం, వినియోగదారులపై భారం మరింత పెరిగే అవకాశం స్పష్టంగా వున్నాయి. అలాగే విద్యుత్ బిల్ వలన ప్రత్యేకంగా గౌతమ్ అదాని, ముకేష్ అంబానీలకు అత్యధికంగా మేలు చేకూరుతుంది.

కార్మికలోకం సంఘటితంగా పలు దశాబ్దాలపాటు పోరాడి సాధించుకున్న అనేక కార్మిక చట్టాలను తొలగించి, కార్మిక ప్రయోజనాలకు గండికొట్టేలా నాలుగు లేబర్ కోడ్‌లను మోడీ ప్రభుత్వం తెచ్చింది. ఇప్పటివరకు భారతదేశం సాధించిన పారిశ్రామిక ప్రగతికి ప్రధాన చోదకశక్తులుగా దోహదపడిన అనేక ప్రభుత్వ రంగ సంస్థలను విశాఖపట్నం స్టీల్ ప్లాంట్‌తోసహా నూటికి నూరు శాతం కార్పొరేట్లకు కారుచౌకగా కట్టబెట్టేందుకు మోడీ ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలను దాదాపు అన్ని కార్మిక సంఘాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. దాదాపు వంద లక్షల కోట్ల ప్రజాధనం, డిపాజిట్ల రూపంలో బ్యాంకులలో వుంది. తాను అధికారంలో వున్న ఏడు సంవత్సరాలలో దాదాపు ఎనిమిది లక్షల కోట్ల రూపాయల కార్పొరేట్ల బకాయిలను రద్దు చేయడంతో ఆగకుండా మొత్తం బ్యాంకింగ్ వ్యవస్థనే కార్పొరేట్ల హస్తగతం చేయాలన్న కేంద్ర ప్రభుత్వ వైఖరికి నిరసనగా మార్చి 23, 24 తేదీలలో దేశవ్యాప్తంగా యావన్మంది బ్యాంక్ ఉద్యోగులు సమ్మెను నిర్వహించారు.

2020 ప్రారంభ దశలోనే కరోనాను కట్టడి చేయడంలో నిర్లక్ష్యం వహించిన మోడీ ప్రభుత్వం సెప్టెంబర్-డిసెంబర్ వ్యవధిలో కరోనాను జయించామని, ప్రపంచ దేశాలకు భారత్ వ్యాక్సిన్‌ను సరఫరా చెయ్యగలదని ప్రగల్భాలు పలికింది. కరోనా రెండవ వేవ్ ప్రమాదం గురించి శాస్త్రజ్ఞులు ముందుగా హెచ్చరించినా తగు నిర్ణయాలు తీసుకోకుండా కాలయాపన చేసింది. లక్షలాది మంది ప్రజలు ప్రాణాలు కోల్పోడానికి నరేంద్రమోడీ ప్రభుత్వమే ప్రధాన కారణమని మన దేశ ప్రజలేకాక పలు దేశాల శాస్త్రజ్ఞులు, ఆరోగ్యరంగ నిపుణులు కూడా వ్యక్తం చేస్తున్నారు. సుప్రీం కోర్టు సైతం మోడీ ప్రభుత్వం ప్రకటించిన వ్యాక్సిన్ విధానాన్ని తప్పుబట్టింది.

ఆనాడు జె.పి. ప్రవచించిన సంపూర్ణ విప్లవం స్ఫూర్తి ఈనాడు ఎంతో అవసరం. ప్రజల చేత, ప్రజల కొరకు, ఏర్పడ్డ ప్రజా ప్రభుత్వాలు ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా వారి అభివృద్ధికి కృషి చేయవలసి వుంటుంది. కానీ ఈనాడు కేంద్రంలోను, కొన్ని రాష్ట్రాలలోను అందుకు పూర్తి భిన్నంగా ప్రభుత్వాలు వ్యవహరిస్తూ వున్నాయి. లక్షలాది మంది రైతులు, వృద్ధులు, మహిళలతో సహా ఆరు మాసాలకు పైగా శాంతియుతంగా ఉద్యమం కొనసాగిస్తూ వున్నా కేంద్రప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సంవత్సరం పైగా మహిళలతో సహా శాంతియుతంగా వేలాదిమంది అమరావతి రైతులు ఉద్యమం కొనసాగిస్తున్నా రాష్ట్ర ప్రభుత్వం తన మొండి వైఖరిని మార్చుకోలేదు. ఇక్కడ గమనించవలసిన విషయం ఏమంటే బి.జె.పి. నల్ల వ్యవసాయ చట్టాలను తెస్తామని కాని, విద్యుత్ బిల్-2020 తెస్తామని కాని, ఎల్.ఐ.సి, విశాఖపట్నం స్టీల్‌ప్లాంట్, బి.ఎస్.ఎన్.ఎల్, బి.పి.సి.ఎల్ లాంటి అనేక ప్రభుత్వ రంగ సంస్థలతోపాటు పలు ప్రభుత్వ రంగ బ్యాంకులను ప్రైవేటీకరణ చేస్తామని కాని తన ఎన్నికల ప్రణాళికలో పేర్కొనలేదు. మన రాష్ట్రంలో జగన్ మోహన్ రెడ్డి శాసనసభలో అమరావతి రాజధానికి ఆమోదం తెలపటమేకాక 30 వేల ఎకరాలు రాజధానికి వుండాలనడంతోపాటు తాడేపల్లిలో ఇల్లు కూడా నిర్మించుకున్నారు. తీరా అధికారంలోకి వచ్చాక ఎగ్జిక్యూటివ్ క్యాపిటల్‌ను విశాఖపట్నంనకు తరలించాలని నిర్ణయించడం ఎంతమాత్రమూ సరికాదు.

ఆనాడు జె.పి. ఆశించినట్లు ఈనాడు వ్యవస్థలతోపాటు ప్రజలలో కూడా మార్పు రావాల్సి వుంది. ఆనాడు అవినీతికి వ్యతిరేకంగా యువత పోరాడింది. ఆ ఫలితంగానే ప్రజాస్వామ్యం పునరుద్ధరించబడింది. ఈ ఏడు సంవత్సరాలలో వేలాది కోట్ల రూపాయల విలువైన ప్రభుత్వ రంగ ఆస్తులు అనగా ప్రజల ఆస్తులను కారుచౌకగా కార్పొరేట్లకు అమ్మివేస్తున్నప్పటికీ... పెట్రోల్, డీజిల్, వంటగ్యాస్‌ల ధరలను అడ్డగోలుగా, విపరీతంగా పెంచివేసినప్పటికి యువత తగినంతగా స్పందించడం లేదు. లక్షలాదిమంది వలస కూలీలు ఉపాధి కోల్పోయి రోడ్డుపాలయ్యారు. నిరుద్యోగం రికార్డు స్థాయిలో పెరిగింది. కేంద్ర ప్రభుత్వ అసమర్థ, అహంభావ పూరిత వైఖరి, చేతకానితనం వల్ల లక్షలాది మంది ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారు. దేశంలో ఈనాడు అత్యంత విషాదకర పరిస్థితులు నెలకొని వున్నాయి. ఈ నేపథ్యంలో వ్యవస్థలలో మార్పు కోసం అన్ని వర్గాల ప్రజలు పాటుపడినప్పుడే జె.పి. ఆశించిన సంపూర్ణ విప్లవం ఆశయాలు సార్థకమవుతాయి. క్రోనీ క్యాపిటలిజానికి తావు లేకుండా....కార్పొరేట్ల బారి నుండి భారత వ్యవసాయ రంగాన్ని, ప్రభుత్వ రంగ సంస్థలను, ప్రభుత్వ బ్యాంకులను రక్షించుకునేందుకు అప్పుడే వీలు కలుగుతుంది.

***(వ్యాసకర్త ఎ.పి. సంయుక్త కిసాన్ మోర్చా కన్వీనర్/ మాజీ మంత్రి)***

# కేంద్రంలో అధికారముంటే ఆరోగ్య రంగాన్ని జాతీయం చేసేవాళ్లం





కె.కె.శైలజ
(కేరళ మాజీ ఆరోగ్య శాఖ మంత్రి)

కోవిడ్-19 మహమ్మారిని కట్టడి చేయడంలో కేరళ ఎల్‌డిఎఫ్ ప్రభుత్వం చేస్తున్న కృషి ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు పొందింది. కోవిడ్ వంటి మహమ్మారుల నుంచి ప్రజలను కాపాడుకునేందుకు ప్రజారోగ్య వ్యవస్థ ఎంత కీలకమో, ఆరోగ్య రంగాన్ని జాతీయం చేయాల్సిన అవసరం ఏమిటో కె.కె. శైలజ తాను కేరళ ఆరోగ్య శాఖ మంత్రిగా వున్నప్పుడు ఆంగ్లపత్రిక 'బిజినెస్ లైన్'కి తెలిపారు. ఇంటర్వ్యూ వివరాలు క్లుప్తంగా...

**ప్రస్తుత సంక్షోభం నుంచి నేర్చుకోవాల్సిన గుణపాఠం ఏమిటి ?**

నా ఉద్దేశంలో రెండు విషయాలు ఉన్నాయి. మొదటిది మనదేశంలో ఒక పకడ్బందీ ఆరోగ్య ప్రణాళిక, దాన్ని అమలు పరిచే వికేంద్రీకరించబడిన యంత్రాంగం లేదు. దానిద్వారానే ఆరోగ్య వ్యవస్థను అభివృద్ధి చేయగలం. రెండవది వైద్యం పద్దుకు మనం కేటాయిస్తున్న నిధులు కేవలం జిడిపిలో ఒక శాతం మాత్రమే. కనీసం పదిశాతం కేటాయించాలి. ఇప్పుడు ఏ ఆలస్యం లేకుండా ప్రభుత్వ నిధుల కేటాయింపు జరగాలి. క్యూబా లాంటి దేశంలో ఆరోగ్య రంగానికి పెద్ద ఎత్తున నిధులు కేటాయిస్తున్నారు.

**మీ సలహా ఏమిటి ?**

నేను వామపక్షవాదిని. కేంద్రంలో మా ప్రభుత్వం ఉండి ఉంటే మేం ఆరోగ్య రంగాన్ని, విద్యను ఇప్పటికే జాతీయం చేసేవారం. ఆరోగ్య సేవలపై ప్రభుత్వ పూర్తి నియంత్రణ ఉండాలి. అప్పుడే ధనిక, పేద అనే తేడా లేకుండా అందరికి వైద్యం సమానంగా అందుతుంది.

ప్రస్తుత కేంద్ర ప్రభుత్వం పెట్టుబడిదారీ భావజాలాన్ని కలిగి వున్నది. పెట్టుబడిదారీ ఆలోచనలు ఉన్నప్పటికీ ప్రభుత్వ పరమైన ఆరోగ్య వ్యవస్థను అభివృద్ధి చేయడానికి వారు ప్రయత్నించాలి. ప్రయివేటు రంగం ద్వారా ఆరోగ్య సేవలు అందిస్తున్నవారిపై ప్రభుత్వ నియంత్రణ ఉండాలి. వాళ్ళు పేదవారిని దోచుకోకుండా ప్రభుత్వం చర్యలు చేపట్టాలి.

**ఇతర దేశాలలో ఏమన్నా మంచి ఉదాహరణలు ఉన్నాయా ?**

స్కాండినేవియన్ దేశాలు చాలా ఆదర్శంగా ఉన్నాయి. అయితే నేను వాటిని చూడలేదు. నేను ఇంగ్లండ్ వెళ్లి వారి జాతీయ ఆరోగ్య సేవలు ఎన్‌హెచ్‌ఎస్, జిపి సర్జరీ విధానాన్ని చూసి వచ్చాను. మేము కేరళలో కుటుంబ ఆరోగ్య కేంద్రాల వ్యవస్థను ప్రారంభించడానికి ఇంగ్లండ్‌లో ప్రాథమిక ఆరోగ్య విధానం, క్యూబా లోని కుటుంబ డాక్టర్ విధానం నుంచి ప్రేరణ పొందాము. సార్వత్రిక ఆరోగ్య సంరక్షణ ఉండాలి. క్షేత్ర స్థాయిలో సౌకర్యాల కల్పనపై కొన్ని నిబంధనలు కచ్చితంగా పాటించాలి. ప్రాథమిక, మాధ్యమిక క్షేత్ర స్థాయిలకు ఎక్కువ నిధులు కేటాయించాలి. కొన్ని నిబంధనలతో వికేంద్రీకరణ పద్ధతిని పాటించాలి. క్యూబా విజయం సాధించడానికి కేంద్ర స్థాయిలో ప్రణాళిక, రూపకల్పన జరిగి, దాని అమలు వికేంద్రీకరణ ద్వారా జరగడంలోనే ఉన్నది. అదే సరైన విధానం. వారి వైద్య విధానంలో ప్రజలు, పేషంట్లను కేంద్ర బిందువు చేసుకుని పని చేస్తున్నారు. ఆ విధానాన్ని మనం ఇక్కడ అమలు జరపవచ్చు.

**ఇతర రాష్ట్రాలతో పోల్చితే కేరళ ప్రత్యేకత ఏమిటి ?**

మేం 2016లో అధికారంలోకి వచ్చినప్పుడు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఒక పూట మాత్రమే నడుస్తున్నాయి. అంటే మధ్యాహ్నం వరకే అందుబాటులో ఉన్నాయి. వాటిలో ల్యాబ్ సౌకర్యం ఉండేది





కాదు. ఏమైనా పరీక్ష చేయించుకోవాలంటే రోగులు పట్టణాలకు లేదా ప్రాంతీయ ఆరోగ్య కేంద్రాలకు వెళ్ళవలసి వచ్చేది. అప్పుడు నేను 'రోగ నివారణ' మీద కేంద్రీకరించాలని భావించాను. కేరళలో జీవనసరళి కారణంగా వచ్చే రోగాలు ఎక్కువ. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో ప్రతి రోగిపై ప్రత్యేక దృష్టి ఉంటుంది. వీటి దృష్ట్యా ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు మంచి భవనాలు, మూత్రశాలలు, ల్యాబులు, అవుట్ పేషెంట్ గదులు, టీకాలు వేయడానికి పిల్లలకు సౌకర్యంగా ఉండే గదులు ఏర్పాటు చేశాం. స్థానిక ప్రభుత్వాలు కేఐఐఈబి ఇందులో కీలక పాత్ర వహించాలి. ఈ మౌలిక సౌకర్యాల నిర్మాణానికి రాష్ట్ర ప్రభుత్వం తరపున గ్రామ సర్పంచులకు, ఆరోగ్యశాఖ అధికారులకు శిక్షణ ఇచ్చాం. కేంద్ర నిధులు పరిమితంగా ఉన్నా వీరు మంచి పాత్ర పోషించారు. చాలా మంది స్వచ్ఛందంగా ఈ మౌలిక సదుపాయాల ఏర్పాటుకు ఆర్థికంగా సహకరించారు.

మాకు ఉన్న 946 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు గాను 617కు కొత్త సొంత భవనాలు ఏర్పాటయ్యాయి. ఇది ప్రజా ఉద్యమంగా సాగింది. 100కి పైగా పిహెచ్‌సిలు జాతీయ నాణ్యతాస్థాయి ధృవీకరణ పొందాయి. తాలూకా స్థాయిలో రెండవ స్థాయి ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేశాము. వీటిలో కొన్ని కార్పొరేట్ హాస్పటళ్ల కంటే ఎక్కువ సౌకర్యాలను కలిగి ఉన్నాయి. ప్రాంతీయ స్థాయి ఆరోగ్య వ్యవస్థ కూడా బాగా అభివృద్ధి సాధించింది. వైద్య కళాశాలలను ఆధునీకరించాం. కొత్త వైద్య కళాశాలలను ప్రారంభించాము. వీటిలో అత్యంత ఆధునిక పరికరాలు అందుబాటులో ఉన్నాయి. వాటిలో వైద్య పరిశోధనకు కూడా అవకాశం కల్పిస్తున్నాము. 2016లో 37 శాతం మంది ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాలపై ఆధారపడేవారు. ఇప్పుడు ఏ సంకోచం లేకుండా 50 శాతం మంది ప్రజలు ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాలకు వస్తున్నారు. ఆరోగ్య వ్యవస్థలో తీసుకువచ్చిన మార్పులు, మహమ్మారిని ఎదుర్కోవడంలో మాకు బాగా ఉపయోగపడ్డాయి. మా లక్ష్యం ఆరోగ్య సంరక్షణ అత్యంత సులభంగా అందుబాటులో వుండేలా తీర్చిదిద్దటం. వైద్యం వ్యవస్థ భారంగా ఉండకూడదు, స్నేహపూర్వకంగా పనిచేయాలి.

**ఆక్సిజన్, వ్యాక్సిన్ కొరతను ఈరోజు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తీవ్రంగా ఎదుర్కొంటున్నాయి. దీని గురించి మీరు ఏమంటారు ?**

కేంద్ర ప్రభుత్వానికి ఒక ప్రణాళిక ఉండాల్సింది. కేరళ ఇందుకు మినహాయింపు కాదు కదా! ఆక్సిజన్ సరఫరా సమస్యలు రావచ్చని మేము ముందే అంచనాకు వచ్చాము. 2020 మే నెలలోనే మేము ఈ అంశంపై కేరళ పరిశ్రమల మంత్రిత్వశాఖతో సమావేశం జరిపి పాల్‌ఘాట్ జిల్లాలో ఆక్సిజన్ ప్లాంట్‌ను ప్రారంభించాలని నిర్ణయించాం, నిర్మాణం పూర్తిచేశాం. ఇప్పుడు అది ఒక వరంలా పనికి వచ్చింది. తగినంత ఆక్సిజన్ ఉత్పత్తి జరుగుతున్నది. అయితే సరఫరాలో కొన్ని అడ్డంకులు ఉన్నాయి. వాటి పరిష్కారం కోసం సిలిండర్లు, ట్యాంకర్లు తెప్పించాలని నిర్ణయించాము. కేంద్రం నిర్వహిస్తున్న మీటింగ్‌లు కేవలం మా దగ్గర ఉన్న సమాచారం ఇతరులతో పంచుకోవడానికి మాత్రమే పనికి వస్తున్నాయి. మేం కోరిన వ్యాక్సిన్ అందించే విషయంలో కేంద్ర ప్రభుత్వం ఏ భరోసా ఇవ్వడం లేదు.

కేంద్ర ప్రభుత్వం అవలంభిస్తున్న టీకాల విధానం మందుల పరిశ్రమల యజమానులకు భారీ లాభాలు కట్టబెట్టేదిగా మాత్రమే ఉన్నది. కేంద్రం దీన్ని లాభాలు దృష్టితో చూడకూడదు. రాష్ట్రాలకు వారి ప్రజలకు తమ పద్ధతిలో వ్యాక్సిన్ ఇచ్చే స్వేచ్ఛను ఇవ్వాలి. రాష్ట్ర ప్రభుత్వాలు పరిశ్రమల యజమానులతో తమ రాష్ట్ర ప్రజల ప్రాణాలను దృష్టిలో పెట్టుకుని బేరసారాలు జరపడం కుదరదు. ప్రజల ప్రాణాలు, వారి ఆరోగ్యం అత్యంత ప్రాధాన్యత కలిగిన కీలక అంశాలు. అందుకని మా రాష్ట్రంలో 100 శాతం వ్యాక్సిన్ వినియోగించ బడుతున్నది. ఒక్క వ్యాక్సిన్ కూడా వృధా కావడంలేదు. మే ఒకటి నుంచి వ్యాక్సిన్ అమ్మకం జరుగుతుంది. కాబట్టి అక్రమ నిల్వలు జరుగుతున్నట్టు నాకు అనుమానం ఉన్నది. కేంద్రం నుంచి సరిపోయినంత వ్యాక్సిన్ సరఫరా జరగడం లేదు. ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాలను నమ్మాలి. అప్పుడే ఈ రెండవ ఉప్పెనను సమర్థవంతంగా ఒక నెలలో అడ్డుకోగలమన్న పూర్తి నమ్మకంతో ఈ మాటలు చెప్తున్నాను. *




రాష్ట్రంలో వివిధ పంటల పరిస్థితి బాగానే ఉన్నా ధరల పరిస్థితే దారుణంగా తయారైంది. అసలే కరోనా కాటుతో ఉపాధి కోల్పోయిన జనం నానా అవస్థలు పడుతున్నారు. కరోనా బూచి చూపి తక్కువ ధరకు కొనుగోళ్లు చేయడం, దళారులు దండిగా దండుకోవడం పరిపాటిగా మారినా ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. ఎగుమతులు పడిపోవడం, కొనేవారు లేకపోవడం వంటి అంశాల వల్లే ధరలు తగ్గాయని ముక్తాయింపు ఇస్తున్నాయి. మిర్చి, మొక్కజొన్న, శనగ, అరటి, పొగాకు, మామిడి, ఆక్వా, మిరియాలు ఆఖరికి కరివేపాకు, పూల ఉత్పత్తులకు కూడా ధరలు గిట్టడం లేదు.

**మిర్చి :** గుంటూరు మిర్చి యార్డులో వ్యాపారులు ధర తగ్గించి కొంటున్నారు. క్వింటాలుకు రూ. 3 వేల నుంచి రూ. 4 వేలకు ధరలు తగ్గిపోయాయి. జూన్ ఆరు వరకూ సెలవు కావడంతో దాదాపు నెల రోజులపాటు ఇళ్లలో దాచుకోలేక రైతులు మిర్చిని అయినకాడికి అమ్ముకుంటున్నారు. 80 లక్షల టిక్కీల మిర్చిని నిల్వ చేసుకునే అవకాశం గుంటూరు పరిసరాల్లోని కోల్డ్ స్టోరేజీల్లో ఉంది. 60 లక్షల టిక్కీలు ఇప్పటికే నిల్వ ఉన్నాయి. ఈ నెల రోజుల్లో గ్రామాల నుంచి రైతులు తమ నిల్వలను తీసుకొచ్చి స్టోరేజీల్లో నిల్వ చేసుకునే అవకాశం ఉంది. మరోవైపు ఎగుమతి ఆర్డర్లు ఖరారు కాకపోవడంతో వ్యాపారులు కూడా కోల్డ్ స్టోరేజీల్లోనే నిల్వ చేస్తున్నారు. కొన్ని రోజుల కిందటతో పోలిస్తే తేజ బెస్ట్, సూపర్ డీలక్స్, తేజా మీడియం, 355 బేడింగ్, సువర్ణ బేడీ, 341 మంచివి, సిజెండా బేడింగ్, డబ్బీ బేడింగ్, నంబరు 5, నాటు రకాలకు రూ. 2 వేల నుంచి రూ. 3 వేల వరకూ ధరలు తగ్గించి కొనుగోలు చేస్తున్నారు.

**పొగాకు :** ఈ ఏడాది పొగాకు సాగుకు పెట్టుబడులు భారీగా పెరిగాయి. కిలోకి కనీసం రూ. 200 ధర ఇస్తే గిట్టుబాటు అవుతుందని రైతులు అంటున్నారు. ప్రారంభంలో గరిష్ట ధర రూ. 182 ఇచ్చారు. రైతులు దీనిపైనే నిరాశ చెందారు. కొంతకాలంపోతే ధర పెంచుతారనే ఆశతో ఉన్నారు. అయితే నేటికీ ఇదే ధర పలుకుతోంది. ఇప్పటివరకూ ప్రకాశం, నెల్లూరు జిల్లా పరిధిలోని రెండు రీజియన్లలో కలిపి 20 మిలియన్ కిలోల పొగాకు వేలం జరిగింది. సగటు ధర దక్షిణాది నల్లరేగడి నేలల్లో రూ. 158.50 ఉంది. దీని పరిధిలోని ఒంగోలు, వెల్లంపల్లి, టంగుటూరు, కొండపి, కేంద్రాలున్నాయి. ఇక్కడ 9.21 మిలియన్ కిలోలు కొనుగోలు చేశారు. దక్షిణాది తేలిక నేలల్లోని కేంద్రాల్లో 9.77 మిలియన్ కిలోలు కొన్నారు. ఇక్కడ సగటు ధర రూ. 163.84గా ఉంది. మొత్తంగా చూస్తే కిలోకు రూ. 160 వచ్చింది. అంటే కిలోకు గరిష్ట ధరతో చూస్తే రూ. 20 ధర పతనమైంది. ఈ మేరకు రైతులు నష్టపోయారు. పొగాకు బోర్డు వైఫల్యమూ ఉంది. రైతులకు ఎంత ధర ఇవ్వాలి, ఎంత ధర ఇస్తున్నారు వంటి సమీక్షలు చూడా చేయలేదు.

**ఆక్వా :** ప్రతికూల పరిస్థితుల్లో సాగు చేసి ఉత్పత్తులు తీసినా, కరోనా సాకుతో నెలరోజులుగా వ్యాపారులు రొయ్య ధరలు తగ్గించి కొనుగోలు చేస్తున్నారు. ఒక్క తూర్పుగోదావరి జిల్లానే చూసుకుంటే సముద్రం నుంచి కానీ, చెరువుల నుంచికానీ ఏటా 1.40 లక్షల టన్నుల రొయ్యలు సేకరణ జరుగుతోంది. రూ. 3,800 కోట్ల వరకూ వ్యాపారం సాగుతోంది. కరోనా ఆంక్షల కారణంగా ఒరిస్సా, పశ్చిమబెంగాల్, గుజరాత్ వంటి రాష్ట్రాలకు, అమెరికా, చైనా దేశాలకు ఇక్కడి నుంచే ఎగుమతులు జరుగుతుంటాయి. లాక్‌డౌన్, కర్ఫ్యూ ఆంక్షల వల్ల ఎగుమతులు నిలిచిపోయి ధరలపై తీవ్ర ప్రభావం పడింది. రైతు అయినకాడికి అమ్ముకోవాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. వ్యాపారులు సిండికేట్‌గా ఏర్పడి ధరలు అమాంతం తగ్గించేస్తున్నారు. 15 రోజుల వ్యవధిలో ప్రతి కౌంట్ పైన (50 నుంచి 100 వరకూ కౌంట్లపై) సగటు రూ. 40 నుంచి రూ. 50 వరకు తగ్గించి కొనుగోలు చేస్తున్నారు. ఉదాహరణకు 50వ కౌంట్ 15 రోజుల కిందట రూ. 340 ఉంటే ఇప్పుడు రూ. 300 మాత్రమే పలుకుతోంది.

**మామిడి :** చిత్తూరు జిల్లాలో మామిడికి సరైన ధర రావడం లేదు. 2,80,472 ఎకరాల్లో మామిడి తోటలుండగా 1,68,020 ఎకరాల్లో తోతాపురి తోటలున్నాయి. వీటిని ఎక్కువగా జ్యూస్ ఫ్యాక్టరీలకు తరలిస్తుంటారు. జిల్లాలో 45 జ్యూస్ ఫ్యాక్టరీలు ఉంటే ఇప్పుడు 26 మాత్రమే ఉత్పత్తి చేస్తున్నాయి. గతేడాది మొదట్లో కిలో మామిడి ధర రూ. 12 ఉండగా, సీజన్ ముగిసేనాటికి రూ. 24 పలికింది. అదే

తీరులో ధర ఈ యేడాదీ ఉంటుందని భావించారు. అయితే దళారులు కరోనా బూచి చూపి రైతులను దోచుకుంటున్నారు. లాక్‌డౌన్ వల్ల కూలీలకు కొరత వచ్చిందని, ఫ్యాక్టరీలు పంటలు కొనవని చెపుతూ దళారులు కిలో రూ.4 నుంచి రూ.7కే రైతులతో ఒప్పందాలు కుదుర్చుకుంటున్నారు. ముందు ముందు ఈ ధరైనా వస్తుందో రాదోననే భయంతో రైతులు పంటను తక్కువ ధరకే ఇచ్చేస్తున్నారు.

**శనగ :** ఈ పంటకూ మద్దతు ధరలేదు. కేంద్రం ఈ పంటకు క్వింటాలు రూ.5,120 మద్దతు ధర ప్రకటించింది. ప్రకాశం జిల్లాలో ఈ ఏడాది పది నుంచి 12 లక్షల క్వింటాళ్ల వరకూ పంట దిగుబడి వచ్చింది. మార్క్‌ఫెడ్ నామమాత్రంగా కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేసింది. ఇక్కడా అనేక నిబంధనలు రైతులు ఆటంకంగా మారాయి. దీంతో వ్యాపారులకు తెగనమ్ముకుంటున్నారు. వ్యాపారులు క్వింటాలుకు రూ.4,600 రైతులకు చెల్లిస్తున్నారు. అంటే క్వింటాలు ఒక్కింటికి రూ.600 కు పైగా రైతులు నష్టపోతున్నారు. మరి రైతు భరోసా కేంద్రాలు ఏమి చేస్తున్నట్లో!

**మొక్కజొన్న :** ప్రకాశం జిల్లాలో మొక్కజొన్న బాగా పండింది. మొక్కజొన్నను మార్క్‌ఫెడ్ అధికారులు కొనుగోలు చేశారు. క్వింటాలుకు రూ.1,850 లెక్కన కొన్నారు. వీటిని మార్కెట్ యార్డుల్లోనే పెట్టారు. అక్కడ నుంచి తరలించలేదు. కరోనా కారణంగా రవాణా నిలిచిపోయింది. రైతులకు డబ్బులు చెల్లించలేదు. దీంతో రైతులు వీటిని కాపాడుకోలేక అవస్థలు పడుతున్నారు. కొనుగోలు చేసిన డబ్బులు ఇవ్వకుండా మార్కెట్ యార్డు కళ్లాల్లోనే పడేశారని రైతులు వాపోతున్నారు. ప్రజా ప్రతినిధులు కూడా పట్టించుకోవడం లేదు. వర్షాలకు తడిసిపోతాయని రైతులు ఆందోళన చెందుతున్నారు.

**అరటి :** కరోనా బూచితో అరటి రైతు తీవ్రంగా నష్టపోతున్నాడు. గత నెలలో టన్ను అరటి రూ.15 వేలు పలికింది. ప్రస్తుతం అరటి టన్ను రూ.2 వేలు కూడా పలకడం లేదు. కొనేవారు లేక పంట మొత్తం కళ్లాల్లోనే ఉండిపోతోంది. లాక్‌డౌన్, కర్ఫ్యూ ఆంక్షల వల్ల అనంతపురం జిల్లాలో అరటి మార్కెట్లు ఒక్కోటి మూతపడుతున్నాయి. ఈ జిల్లాలో సుమారు 40 వేల ఎకరాల్లో అరటి సాగవుతోంది. ఎకరానికి 20 నుంచి 25 టన్నులు దిగుబడి వస్తోంది. అరటి సాగుకు ఎకరానికి లక్ష రూపాయలు వరకూ అవుతోంది. ఈ పరిస్థితుల్లో ధర టన్నుకు దాదాపు 13 వేల వరకూ ధర పడిపోయింది. ఇప్పుడు టన్ను రూ.2 వేలు ఇవ్వడమే గగనంగా మారింది.

**పూలు :** అనంతపురం జిల్లాలో సుమారు 10 వేల ఎకరాల్లో పూల తోటలు సాగవుతున్నాయి. ఇందులో చామంతి, గులాబీ, బంతి, మల్లె, లిల్లీ, కనకాంబరం వంటి తోటలున్నాయి. లాక్‌డౌన్ కారణంగా శభకార్యాలు లేవు. దీంతో పూలకు డిమాండ్ తగ్గిపోయింది. చామంతి కిలో ధర రూ.600 నుంచి రూ.50కి తగ్గిపోయింది. మల్లెపూలు సగటున కిలో రూ.250 నుంచి రూ.300 పలికితే గరిష్టంగా కిలో రూ.50కి పడిపోయింది. కిలో రూ. 600 నుంచి రూ.2,000 ధర పలికే కనకాంబరం పూలు ఇప్పుడు కొనే నాధుడే లేడు. కిలో రూ.50 పలికే లిల్లీపూలు కొనేవారు లేక పొలాల్లోనే వదిలేస్తున్నారు. పూల సాగు చేపట్టిన రైతులు ఈ విధంగా నష్టపోయారు.

**- యు.రామకృష్ణ**

# ఆ మూడు చట్టాలతోనే బిజెపి ప్రజా విశ్వాసం కోల్పోయింది

## మాజీ ప్రధాని దేవెగౌడ

మూడు వ్యవసాయ చట్టాలను రద్దు చేయకూడదన్న మొండి వైఖరి కారణంగానే బిజెపి ఆయా రాష్ట్రాల్లో ప్రజాదరణను కోల్పోయిందని మాజీ ప్రధాని దేవెగౌడ ఒక మీడియాకిచ్చిన ప్రత్యేక ఇంటర్వ్యూలో పేర్కొన్నారు. ప్రస్తుత రాజకీయ వాతావరణాన్ని మీరు ఎలా విశ్లేషించగలరన్న ప్రశ్నకు.. సమాధానంగా ఆయన ఈ వ్యాఖ్యలు చేశారు. నూతన వ్యవసాయ చట్టాలను ప్రవేశపెట్టడంతో.. ఇటీవల జరిగిన ఐదు రాష్ట్రాల ఎన్నికల్లో బిజెపి ప్రజల విశ్వాసం కోల్పోయిందని అన్నారు. గతంలో ఎన్‌డిఎ ప్రభుత్వం కుప్పకూలిన అనంతరం కాంగ్రెస్ బలపరిచిన 13 పార్టీల సంకీర్ణ ప్రభుత్వానికి నేతృత్వం వహిస్తూ.. దేశ 13వ ప్రధానిగా 1996 జూన్1 దేవగౌడ ప్రమాణ స్వీకారం చేసిన సంగతి తెలిసిందే. నేటికి 25 సంవత్సరాలు పూర్తికావస్తున్న నేపథ్యంలో ఆయనను మీడియా పలకరించింది. గతంలో 13 పార్టీల కూటమికి నాయకత్వం వహించారు. తిరిగి అటువంటి సంకీర్ణ ప్రభుత్వం వచ్చే అవకాశం ఉందని మీరు



భావిస్తున్నారా? అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ.. అరవింద్ కేజ్రీవాల్, మమతా బెనర్జీ, ఎంకె. స్టాలిన్, నవీన్ పట్నాయక్ వంటి నేతలు వ్యక్తిగతంగా బలమైన నేతలుగా నిరూపించుకుంటున్నారు. రాజకీయ పార్టీల భవితవ్యం ఎప్పుడు ఎలా మారుతుందో చెప్పలేము, ఊహించలేమని అన్నారు.

# నకిలీ మిర్చి విత్తనాలతో కలవరం

- శర్మ






గుంటూరు జిల్లాలో ఈ ఏడాది ఖరీఫ్ ప్రారంభానికి ముందే నకిలీ మిర్చి విత్తనాలు హల్‌చల్ చేస్తున్నాయి. తెలంగాణ నుంచి అనుమతి లేకుండా జిల్లాలోకి వచ్చి విత్తనాలను విక్రయిస్తుండటం రైతులను కలవరపరుస్తోంది. ఒకసారి పంట వేస్తే మూడేళ్ల పాటు మొక్కలు సజీవంగా ఉంటాయని, 30 క్వింటాళ్ల దిగుబడి వస్తుందని నమ్మబలికి విత్తనాలు విక్రయిస్తూ భారీగా సొమ్ము చేసుకుంటున్నారు. జిల్లాలో ఆగస్టు నుంచి మిర్చి సాగు ప్రారంభమవుతుంది. నవంబరులో కాపు రావడం ప్రారంభమై గరిష్టంగా ఏప్రిల్ వరకు వస్తుంది. మే నెలలో మిర్చి మొక్కలను తొలగించి ఖరీఫ్ ప్రారంభం నాటికి భూమిని దుక్కి దున్ని పదును చేసి రైతులు సిద్ధం చేస్తుంటారు. ఈ క్రమంలో తెలంగాణకు చెందిన కొన్ని కంపెనీలు మూడేళ్లు మిర్చి మొక్కలు సజీవంగా ఉంటాయని, 30 క్వింటాళ్ల దిగుబడి వస్తుందని రైతులను నమ్మించేందుకు ప్రయత్నిస్తున్నాయి. తాజాగా కిలో విత్తనాలను రూ.2 లక్షల వరకు విక్రయించేందుకు పలువురు వ్యాపారులు జిల్లాకు చేరుకుని 8 గ్రాముల విత్తనాలు ప్యాకెట్ రూ.2 వేలకు విక్రయించినట్లు తెలిసింది. జిల్లాలో ప్రతి యేటా మిర్చిపై పలు తెగుళ్లు దాడి చేసి కాపు రాక చెట్టు పీకేసిన సందర్భాలూ ఉన్నాయి. ప్రధానంగా మిర్చిపై బబ్బర తెగులు నివారణకు రైతులు పురుగుమందులు వాడుతుంటారు. సహజంగా ఎకరాకు వంద గ్రాముల మిర్చి విత్తనాలు వినియోగిస్తారు. గత కొన్నేళ్లుగా కిలో రూ.30 నుంచి రూ.50 వేల వరకు హైబ్రీడ్ మిర్చి విత్తనాలను విక్రయిస్తున్నారు. 2016లో టిడిపి ప్రభుత్వ మిర్చి హైబ్రీడ్ విత్తనాలు రూ.లక్ష వరకు విక్రయించగా అప్పట్లో పెద్ద దుమారమే చెలరేగింది. ఆ తరువాత ఈ ధర గరిష్టంగా రూ.50 వేల వరకు తగ్గింది. ప్రస్తుతం ఎకరాకు గరిష్టంగా 20 క్వింటాళ్ల వరకు దిగుబడి వస్తుంది. రూ.లక్ష నుంచి రూ.లక్షన్నర వరకు ఆదాయం వస్తుంది. సగటు ధర క్వింటాలుకు రూ.10 వేల నుంచి రూ.12 వేలు పలుకుతుంది. పరిస్థితులు అనుకూలిస్తేనే రైతులకు చెప్పుకోదగ్గ లాభం వస్తుంది. ఒక్కో ఏడాది అతివృష్టి, అనావృష్టి పరిస్థితులు తలెత్తితే పెట్టుబడులు కూడా రాని దుస్థితి నెలకొంటుంది. ఈ నేపథ్యంలో నకిలీ మిర్చి విత్తనాలతో రైతులు ఆందోళన చెందుతున్నారు. దీనిపై జిల్లా వ్యవసాయ శాఖ అధికారి విజయభారతి స్పందిస్తూ జిల్లాలో అనుమతి లేని కంపెనీలు మిర్చి విత్తనాలు విక్రయిస్తే సహించేది లేదని, రైతు భరోసా కేంద్రాల ద్వారా విక్రయించేందుకు చర్యలు తీసుకుంటామని తెలిపారు.

### సబ్సిడీ వేరుశనగ విత్తనాల నాణ్యత గాలికి

ఖరీఫ్‌లో రైతులకు పంపిణీ కోసం ప్రభుత్వం సిద్ధం చేస్తున్న సబ్సిడీ వేరుశనగ విత్తనాల్లో నాణ్యతా ప్రమాణాల ఉల్లంఘనలు చోటు చేసుకుంటున్నట్లు ఆరోపణలొస్తున్నాయి. బరువు తక్కువ, నాణ్యతాలోపం కలిగిన వేల క్వింటాళ్లను సేకరించినట్లు తెలుస్తోంది. అలాగే నేషనల్ సీడ్ కార్పొరేషన్ (ఎన్ఎస్ఎ) సరఫరా చేస్తున్న విత్తనాలు నాణ్యత పరంగా లోపభూయిష్టంగా ఉన్నాయని సమాచారం. ఎలాగోలా పంపిణీ లక్ష్యాలు సాధించేందుకు, కమీషన్లను ఆశించి అటు ఎన్ఎస్‌సి ఇటు వ్యవసాయ శాఖ, ఎపి సీడ్స్ కూడబలుక్కొని పెద్ద ఎత్తున నాణ్యతలేని విత్తనాలను నిబంధనలకు విరుద్ధంగా సేకరించి రైతులకు అంటగట్టేందుకు చూస్తున్నారని విమర్శలు వెల్లువెత్తాయి.

### బరువు తక్కువ

వేరుశనగ విత్తనాల సేకరణకు ఆదిలోనే ఎపి సీడ్స్ నిబంధనలు నిర్ణయించింది. తేమ శాతం 9 శాతం లోపు, భౌతిక స్వచ్ఛత కనీసం 96 శాతం, బరువు (షెల్లింగ్) 74 శాతం పైన, మొలక శాతం కనీసం 70 శాతం, తాలు 5 శాతానికి మించకుండా, మట్టి, చెత్తా చెదారం 4 శాతం లోపు ఉండాలని నిర్దేశించింది. ఈ తడవ రబీలో



షెల్లింగ్ సమస్య తీవ్రంగా ఉంది. షెల్లింగ్ శాతం అంటే వంద గ్రాముల విత్తన కాయలను ఒలిస్తే విత్తనం 74 గ్రాములకు ఎట్టి పరిస్థితుల్లో తగ్గకూడదు. నిర్దేశించిన షెల్లింగ్ శాతం కంటే చాలా చోట్ల తక్కువ ఉంటున్నందున సేకరణ టార్గెట్లు చేరడం సాధ్యం కాదని పలు సమావేశాల్లో జిల్లా జెడిఎలు ఉన్నతాధికారులకు చెపుతూ వచ్చారు. నిబంధనను సడలించాలని అనంతపురం జెడిఎ ఒక మీటింగ్‌లో విన్నవించారని తెలిసింది. కడప జిల్లాలో నిర్ణయించిన షెల్లింగ్ శాతానికి తక్కువ సేకరించిన ఏడు వేల క్వింటాళ్లను వెనక్కి పంపినట్లు ఆ జిల్లా స్పెషల్ ఆఫీసర్ తెలిపారు. లక్కిరెడ్డిపల్లె డివిజన్‌లో 68-70 శాతం షెల్లింగ్ ఉందన్నారు. కర్నూలు, చిత్తూరులో ఇదే పరిస్థితి. కాగా తక్కువ షెల్లింగ్ శాతం విత్తనాలను వేల క్వింటాళ్లు సేకరించి కొందరు కమీషన్లు జేబులో వేసుకుంటున్నట్లు ఆరోపణలొస్తున్నాయి.

### ఎన్ఎస్‌సి మరీ ఘోరం

హైదరాబాద్ ప్రాంతీయ కేంద్రంగా, స్థానికంగా కర్నూలులో బ్రాంచి ఆఫీసు కలిగిన నేషనల్ సీడ్ కార్పొరేషన్ (ఎన్ఎస్‌సి)కు క్షేత్ర స్థాయిలో నెట్ వర్క్ లేదు. అయినా కొంత మేరకు రైతుల నుంచి సీడ్‌ను సేకరించి ప్రభుత్వానికి ఇస్తోంది. ఈ ఏడాది అనంతపురానికి 55 వేల క్వింటాళ్లు ఇస్తామనగా ఇప్పటి వరకు 40 వేల క్వింటాళ్ల వరకు సరఫరా చేసినట్లు సమాచారం. కర్నూలుకు ఐదు వేల క్వింటాళ్లు ఇచ్చేందుకు ప్లాన్ చేసింది. ఎన్ఎస్‌సి సేకరించిన విత్తనం నాసిరకం అని షెల్లింగ్, మొలక శాతం సహా పలు నిబంధనలను పాటించలేదని ఆరోపణలొస్తున్నాయి. ఏ రైతుల నుంచి విత్తనాన్ని సేకరించిందో వివరాలు ఇమ్మంటే ఇవ్వట్లేదని ఒకరిద్దరు జెడిఎలు ఉన్నతాధికారులకు ఫిర్యాదులు కూడా చేశారు. స్వయంగా వ్యవసాయ కమిషనర్ సైతం ఎన్ఎస్‌సి సప్లయి చేసే విత్తనాల నాణ్యతను పరిశీలించాలని కర్నూలు జెడిఎతో పాటు ఇతర జెడిఎలకు సూచించారు కూడా. అయినా ఎన్ఎస్‌సి సరఫరా చేసిన విత్తనాల్లో నాణ్యతా ప్రమాణాల ఉల్లంఘనలు చోటు చేసుకున్నాయని తెలుస్తోంది. గతంలోనూ ఆ సంస్థ సరఫరా చేసిన విత్తనాలు చాలా చోట్ల మొలకెత్త లేదన్న ఫిర్యాదులొచ్చాయి.

# వ్యవసాయ నల్ల చట్టాలను రద్దు చేయాల్సిందే

## రాష్ట్ర వ్యాప్తంగా నిరసనలు, జీవో ప్రతుల దహనం

కేంద్రంలో బిజెపి ప్రభుత్వం తెచ్చిన కార్మిక, రైతాంగ, ప్రజావ్యతిరేక మూడు వ్యవసాయ చట్టాలను, విద్యుత్తు సవరణ బిల్లును రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ అఖిల భారత కిసాన్ సంఘర్ష్ కమిటీ (ఎఐకెఎస్‌సిసి) పిలుపు రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల్లోనూ రైతు, కార్మిక, ప్రజాసంఘాలు, సిఐటియు ఆధ్వర్యాన జూన్ 5న నిరసన కార్యక్రమాలు నిర్వహించారు. నల్ల చట్టాల ప్రతులను దహనం చేశారు. గుంటూరు జిల్లా తాడేపల్లిలో నిర్వహించిన నిరసన కార్యక్రమంలో రైతు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి మర్రాపు సూర్యనారాయణ, కౌలు రైతు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి పి.జమలయ్య మాట్లాడుతూ దుర్మార్గమైన ఈ చట్టాలను ప్రభుత్వం వుపసంహరించుకోవాలని డిమాండ్ చేశారు. తెనాలిలో రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు పి.నరసింహారావు పాల్గొన్నారు. గుంటూరు పశ్చిమ జిల్లాలో 28 కేంద్రాల్లో నిరసనలు తెలిపారు. వినుకొండలో రైతు సంఘాల ఆధ్వర్యంలో నల్లచట్టాల ప్రతులను దహనం చేయడానికి ప్రయత్నిస్తుండగా పోలీసులు అడ్డుకున్నారు. కృష్ణా జిల్లాలో మచిలీపట్నంతోపాటు 18 కేంద్రాల్లో నిరసన తెలిపారు. పశ్చిమగోదావరి జిల్లాలో భీమవరం, తాడేపల్లిగూడెంతో పాటు పలు ప్రాంతాల్లో జిఒ ప్రతులను దహనం చేశారు. విశాఖలోని స్టీల్‌ప్లాంట్ బిసి గేటు వద్ద స్టీల్‌ప్లాంట్ కాంట్రాక్టు లేబర్ యూనియన్ (సిఐటియు) ఆధ్వర్యాన ధర్నా నిర్వహించారు. లేబర్ కోడ్, నల్ల చట్టాల ప్రతులను దహనం చేశారు. కంచరపాలెం మెట్టు, రైతుబజార్ వద్ద తోపుడు బండ్ల కార్మికులు నిరసన తెలిపారు. జిల్లాలో అనకాపల్లి, నర్సీపట్నంతో పాటు పలు ప్రాంతాల్లో వ్యవసాయ నల్ల చట్టాల ప్రతులను దహనం చేశారు. శ్రీకాకుళంలోని డేఅండ్‌నైట్ కూడలి వద్ద నిరసన తెలిపారు. రణస్థలంలోని రామతీర్థాలు కూడలి వద్ద ప్లకార్డులతో నినాదాలు చేశారు. విజయనగరంలోని కలెక్టరేట్ వద్ద నిరసన తెలిపారు. పార్వతీపురంలోని అంబేద్కర్ విగ్రహం వద్ద జిఒ ప్రతులను దహనం చేశారు. ప్రకాశం జిల్లా ఒంగోలులో కలెక్టరేట్ వద్ద జిఒ ప్రతులను దహనం చేసి నిరసన తెలిపారు. అనంతపురం తహశీల్దార్ కార్యాలయం వద్ద జిఒ ప్రతులను దహనం చేశారు. కర్నూలు, తూర్పుగోదావరి, కడప, చిత్తూరు, నెల్లూరు జిల్లాల్లోని మండలాల్లో నిరసన కార్యక్రమాలు జరిగాయి.



గుంటూరు జిల్లా తాడేపల్లిలో నిరసన తెలియజేస్తున్న ఎపి రైతు సంఘం, ఎపి కౌలు రైతు సంఘం నాయకులు, రైతులు

# కార్పొరేట్‌కు బాటలు పరచిన వ్యవసాయ ప్రత్యేక బడ్జెట్






కె.ఎస్.వి. ప్రసాద్
94900 99019

రాష్ట్రంలో కార్పొరేట్ సాగును ముందుకు తీసుకుపోయేందుకు ప్రభుత్వం ప్రతిపాదించిన వ్యవసాయ ప్రత్యేక బడ్జెట్ దారులు పర్చింది. ఒక వైపు రైతు పక్షపాతి ప్రభుత్వమని, రైతును విజేతగా నిలుపుతామని చెబుతూనే మరో వైపు సేంద్రీయ వ్యవసాయానికి ప్రత్యేక పాలసీ, విదేశీ సంస్థల రుణంతో ప్రకృతి సేద్యం, భారీ వ్యవసాయ యాంత్రీకరణ, కంపెనీలకు వాటంగా గ్రామాల్లో మల్టీపర్పస్ ఫెసిలిటీ సెంటర్లు, సహకార రంగంలో 'సంస్కరణ'లు, వ్యవసాయానికి ఉపాధి హామీ అనుసంధానం, ఇత్యాది కార్యక్రమాలకు పెద్ద పీట వేసింది. క్లష్టర్ ప్రాతిపదికన అదనంగా లక్ష ఎకరాల్లో ఉద్యానవన పంటల సాగును లక్ష్యంగా నిర్ణయించారు. ఈ తడవ పంటల ధరల స్థిరీకరణ నిధికి భారీగా కోత పెట్టింది. రూ.3 వేల కోట్ల ఏర్పాటుకు నిర్ణయించామంటూనే, గతేడాది పంట విక్రయ నష్టాలను దృష్టిలో పెట్టుకొని. ఈ పద్దు కింద రూ.500 కోట్లు ప్రతిపాదిస్తున్నట్లు తెలిపింది. షరా మామూలే అన్నట్లు ఉచిత విద్యుత్, ఉపాధి హామీ పద్దులు జోడించి పెద్ద బడ్జెట్‌గా చూపించింది. ఈ రెండింటికే రూ.13 వేల కోట్లకుపైగా చూపించింది. 2021-22 సంవత్సర వ్యవసాయ బడ్జెట్‌ను శాసనసభలో సంబంధిత మంత్రి కురసాల కన్నబాబు, మండలిలో రెవెన్యూ మంత్రి ధర్మాన కృష్ణదాస్ ప్రవేశపెట్టారు. వైసిపి అధికారంలోకొచ్చిన తొలేడాది తొమ్మిది మాసాలకు వ్యవసాయానికి రూ.28,866 కోట్లు ప్రతిపాదించగా, నిరుదు రూ.29,159 కోట్లుగా పేర్కొన్నారు. ఇప్పుడు రూ.31,256.36 కోట్లు ప్రతిపాదించారు.

ముందటేడు కంటే నిరుడు కేవలం రూ.293 కోట్లు ఎక్కువ చూపించగా, నిరుటి కంటే ఈయేడు రూ.2,096 కోట్లు అధికమని పేర్కొన్నారు. కాగా తమ ముఖ్య మంత్రి వ్యవసాయానికి ఉదారంగా నిధులు కేటాయిస్తున్నారని మంత్రి కురసాల, ఈ రెండేళ్లల్లో వివిధ పథకాల కింద ఖర్చును గణాంకాలతో తన ప్రసంగంలో వివరించారు. రైతు భరోసా, సున్నా వడ్డీ, ధాన్యం కొనుగోళ్లు, ఉచిత విద్యుత్, ఉచిత పంటల బీమా వీటన్నిటికీ రూ.68 వేల కోట్లు ఖర్చు చేశామన్నారు. విత్తనం నుండి విక్రయం వరకు రైతు సంక్షేమమే ప్రాధాన్యతగా పరిపాలిస్తున్నామని చెప్పారు. పలు సంక్షేమ పథకాలను సోదాహరణంగా ప్రస్తావించారు.

### కౌలు రైతులకూ భరోసా

దేశంలో ఎక్కడా లేనివిధంగా కౌలు రైతులకు, అటవీ భూముల సాగుదారులకు రైతు భరోసా చెల్లించామని మంత్రి తెలిపారు. స్వంత భూమి కలిగిన రైతులకు కోవిడ్-19 ఉన్నప్పటికీ పిఎం కిసాన్‌తో కలిపి నిరుడు, ఈ ఏడు భరోసా ఇచ్చామని పేర్కొన్నారు. ఈ సంవత్సరం మొన్న మే 13న 52.38 లక్షల మందికి రూ.3,928 కోట్లు చెల్లించామన్నారు.

### నిధులకు కత్తెర

వ్యవసాయం, అనుబంధ రంగాల వరకు చూసుకుంటే నిధుల కోత కొనసాగుతోంది. డబ్బుల పరంగా కేటాయింపులు కొంచెం ఎక్కువగా కనిపిస్తున్నా. శాతం పరంగా మొత్తం బడ్జెట్‌లో వాటా దగ్గరకొచ్చే సరికి తగ్గింపు కొనసాగుతోంది. 2019-20లో మొత్తం బడ్జెట్‌లో వ్యవసాయం, అనుబంధ రంగాల పద్దుకు 4.04 శాతం ఖర్చు చేశారు. 2020-21 లో అంచనాలు 6.06 శాతంగా పేర్కొనగా, సవరించిన అంచనాల్లో 5.75 శాతానికి కేటాయింపులను తగ్గించారు. తిరిగి 2021-22లో 5.88 శాతం నిధులు ప్రతిపాదించారు. సవరించిన అంచనాల కంటే స్వల్పంగా అంచనాలు పెరిగానా, చివరాఖరికి ఖర్చు అంత ఉండకపోవచ్చని రెండేళ్లలో కనబర్చిన ధోరణి తెలుపుతోంది.

#### కోత ఇలా...

| | | |
|---|---|---|
| 2019-20 | ఖర్చు | రూ.7,019 కోట్లు (5.75 శాతం) |
| 2020-21 | అంచనా | రూ.13,617 కోట్లు (6.06 శాతం) |
| 2020-21 | సవరించింది | రూ.10,668 కోట్లు (5.75 శాతం) |
| 2021-22 | అంచనా | రూ.13,517 కోట్లు (5.88 శాతం) |

### ఆర్గానిక్ పాలసీ

సేంద్రీయ వ్యవసాయంపై విధానాన్ని వచ్చే ఆర్థిక సంవత్సరం తెస్తామన్నారు. ఇప్పటికే ప్రకృతి వ్యవసాయాన్ని 3,011 గ్రామ పంచాయతీల్లో జర్మన్ అభివృద్ధి బ్యాంక్ రుణంతో అమలు చేస్తున్నారు. మరో 711 గ్రామ పంచాయతీల్లో అమలు చేస్తారు. కేంద్ర ప్రాయోజిత పథకాలు, కెఎఫ్‌డబ్ల్యు సంస్థ, పికెవివై, రాష్ట్ర ప్రభుత్వ నిధులు ఖర్చు చేస్తారు. సహకార వ్యవస్థలో ఆప్కాబ్ మొదలుకొని పిఏసిఎస్ వరకు కొత్త హెచ్‌ఆర్ పాలసీ అమలు చేస్తారు. ఒక చోట నియమితులైన వుద్యోగులు అక్కడే రిటైర్మెంట్ అయ్యే పరిస్థితి ఇక ఉండదు. ప్రైవేటు సంస్థలకు ఊతం ఇచ్చేలా ఆహార శుద్ధి పాలసీ అమలు. యాంత్రీకరణను పెంచేలా ఆర్‌కెవివై, ఇతర నిధులు వ్యయం చేస్తారు.

## ముఖ్య ప్రతిపాదనలు

| వివరం | కేటాయింపు<br>రూ. కోట్లు |
|---|---|
| రైతు భరోసా | 6,876 |
| ఉచిత పంటల బీమా | 1,802 |
| విపత్తు సహాయ నిధి | 2,000 |
| పశు సంవర్ధకం | 1,026 |
| ఉచిత విద్యుత్ | 5,000 |
| ఉపాధి హామీ | 8,116 |
| ధరల స్థిరీకరణ నిధి | 500 |
| ఉచిత బోర్లు | 200 |
| విత్తన సబ్సిడీ | 100 |
| హార్టికల్చర్ | 537 |
| అగ్రి వర్సిటీ | 359 |
| పశువైద్య వర్సిటీ | 147 |
| సున్నావడ్డీ | 500 |
| ఆర్‌బికెలు | 128 |
| మార్కెటింగ్ | 610 |
| సహకారశాఖ | 303 |
| ఫుడ్ ప్రాసెసింగ్ | 186 |
| ఫిషరీస్ | 329 |
| హార్టి వర్సిటీ | 69 |
| సెరి కల్చర్ | 97 |
| ఎక్స్‌గ్రేషియా | 20 |

## 2021- 22 ఖరీఫ్ సీజనుకు వివిధ పంటలకు కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన కనీస మద్దతు ధరలు



| పంట రకం | మద్దతు ధర (రూ) |
|---|---|
| వరి ధాన్యం (సాధారణం) | 1,940 |
| వరి ధాన్యం ( ఏ గ్రేడ్) | 1,960 |
| జొన్నలు (హైబ్రీడ్) | 2,738 |
| జొన్నలు (మల్దండి) | 2,758 |
| సజ్జలు | 2,250 |
| రాగులు | 3,377 |
| మొక్కజొన్న | 1,870 |
| కందులు | 6,300 |
| పెసలు | 7,275 |
| మినుములు | 6,300 |
| వేరుశనగ | 5,550 |
| పొద్దు తిరుగుడు | 6,015 |
| సోయాబీన్ | 3,950 |
| నువ్వులు | 7,307 |
| నల్ల నువ్వులు | 6,930 |
| పత్తి (మీడియం స్టేపుల్) | 5,276 |
| పత్తి (లాంగ్ స్టేపుల్) | 6,025 |

# రైతుల ఆందోళనతో దిగొచ్చిన హర్యానా సర్కార్






రైతుల ఆందోళనతో హర్యానాలోని మనోహర్‌లాల్ ఖట్టర్ ప్రభుత్వం దిగొచ్చింది. తోహనా విసయంతో రైతులు విజయం సాధించారు. జన్‌నాయక్ జనతా పార్టీ (జెజెపి)కి చెందిన ఎమ్మెల్యే ఇచ్చిన ఫిర్యాదు మేరకు రైతులను ఇటీవల అరెస్టు చేశారు. అరెస్టు చేసిన రైతులను వెంటనే విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ హర్యానాలోని తొహానా పోలీస్ స్టేషన్ వద్ద రైతులు పెద్దఎత్తున ఆందోళన నిర్వహించారు. జూన్ 6న ఫతేబాద్, హిస్సార్, జింద్, సిర్సా జిల్లాల నుంచి తొహానా పోలీస్ స్టేషన్‌కు వేలాదిమంది రైతులు చేరుకుని, ఆందోళన కొనసాగించారు. జూన్ 7న హర్యానాలో అన్ని పోలీస్ స్టేషన్ల వద్ద ఘెరావ్ చేయాలని రైతు సంఘాలు పిలుపునిచ్చాయి. జన్ నాయక్ జనతా పార్టీ (జెజెపి) ఎమ్మెల్యే ఫిర్యాదు మేరకు అరెస్ట్ చేసిన రైతు నేతలు రవి ఆజాద్, వికాష్ సిర్సాలను విడుదల చేసే వరకు నిరసన ఆపబోమని భారతీయ కిసాన్ యూనియన్ (బికెయు) నేత రాకేశ్ టికాయత్ స్పష్టం చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ.. "అన్యాయంగా ఇద్దరు రైతుల్ని అరెస్ట్ చేశారు. తాను పెట్టిన కేసును వెనక్కి తీసుకుంటున్నట్లు స్వయంగా ఎమ్మెల్యే దేవేంద్ర సింగ్ బాబ్లి ప్రకటించారు. తన వ్యాఖ్యలకు క్షమాపణలు కూడా చెప్పారు. అయినా పోలీసులు రైతుల్ని విడుదల చేయడం లేదు. అధికారులతో మాట్లాడినప్పటికీ విడుదలకు అంగీకరించడం లేదు. వారిని విడుదల చేయండి. లేదంటే మమ్మల్ని కూడా అరెస్ట్ చేయండి. రైతుల్ని విడుదల చేసే వరకు నిరసన కొనసాగిస్తాం." అని అన్నారు. బహిరంగంగా రైతులను దూషిస్తూ మాట్లాడిన ఎమ్మెల్యే బబ్లిపై ఎఫ్ఐఆర్ నమోదు చేయాలని ఆయన డిమాండ్ చేశారు. అక్రమంగా అరెస్టు చేసిన అమాయక రైతులను విడుదల చేయాలని, వారిపై ఎఫ్ఐఆర్ ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేస్తూ మూడు రోజులపాటు రైతులు తమ ఆందోళన కొనసాగించారు. తోహానాలో పోలీసు స్టేషన్‌ను దిగ్బంధించారు. వేలాది మంది రైతుల నుంచి నిరంతరాయంగా పెరుగుతున్న ప్రతిఘటన వల్ల రైతుల అన్నిడిమాండ్లకు హర్యానా ప్రభుత్వం అంగీకరించింది. ధర్నాలో సంయుక్త కిసాన్ మోర్చా నేత గుర్నామ్ సింగ్ ఛాదుని, యోగేంద్ర యాదవ్, యుద్వీర్ సింగ్, జోగేందర్ నైన్, సురేష్ కొత్ తదితరులు పాల్గొన్నారు.

### సంకల్ప దివస్ విజయవంతం

దేశవ్యాప్తంగా సంకల్ప దివస్ విజయవంతమైంది. 2017లో మధ్యప్రదేశ్ మంద్సౌర్‌లో రైతుల ఆందోళనలపై పోలీసుల కాల్పుల్లో ఆరుగురు మరణించారు. రైతు అమర వీరులను గుర్తు చేసుకుంటూ సంయుక్త కిసాన్ మోర్చా ఇచ్చిన "సంకల్ప దివస్" అన్ని రాష్ట్రాల్లో జరిగింది. ఆన్‌లైన్‌లోనూ, భౌతికంగా ఆందోళనలు జరిగాయి.

### సింఘూకు వేలాదిమంది రైతుల రాక

దేశ రాజధాని ఢిల్లీ సరిహద్దుల్లో జరుగుతున్న రైతు ఉద్యమం జూన్ 6 నాటికి 192వ రోజుకు చేరింది. సింఘూ సరిహద్దు వద్దకు వెయ్యి వాహనాలతో వేలాది మంది రైతులు చేరుకొని, ప్రదర్శన చేపట్టారు.

**దుబాయిలో జరుగుతున్న ఆసియా ఛాంపియన్‌షిప్ పోటీలలో తాను గెలిచిన కాంస్యపతకాన్ని.. కేంద్ర ప్రభుత్వ రైతు వ్యతిరేక చట్టాలపై ఉద్యమిస్తున్న అన్నదాతలకు అంకితమిచ్చిన బాక్సర్ స్వీటీ బోరా!**



I AM THE DAUGHTER OF A FARMER. THE MEDAL THAT I HAVE WON, I DEDICATE TO THE FARMERS WHO LOST THEIR LIVES IN THE MOVEMENT AGAINST THE AGRICULTURAL LAWS.
- SWEETIE BOORA, INTERNATIONAL BOXER.

# 40 లక్షల టన్నులు!

## కొనుగోళ్లు లేక రైతుల వద్ద ఉన్న ధాన్యం

కోవిడ్ సెకెండ్ వేవ్ సంక్షోభం, అకాల వర్షాలు, ప్రభుత్వ లోపభూయిష్ట విధానాలు, కార్యాచరణ వైఫల్యం, మిల్లర్లు, వ్యాపారులు, దళారులపై నియంత్రణ లేమి వెరశి రాష్ట్రంలో వరి రైతులకు రబీలో తాము పండించిన ధాన్యాన్ని అమ్ముకోలేని దైన్యం దాపురించింది. రైతుల వద్ద, కల్లాల్లో తక్కువలో తక్కువ 40 లక్షల టన్నుల ధాన్యం కొనుగోళ్ల కోసం ఎదురు చూస్తోంది. రైతుల కల్లాల (పొలాలు) వద్ద నేరుగా సేకరిస్తామంటున్న 'ఫార్మ్ గేట్' పథకం, వినూత్నమన్న రైతు భరోసా కేంద్రాలు (ఆర్‌బికె) ప్రచారానికే తప్ప రైతులకు ఏ మాత్రం ఉపయోగపడలేదు. ఒక వైపు తుపాన్లు, తొలకరి ముందు అడపాదడపా పడే అకాల వర్షాలు మరో వైపు ముంచుకొస్తున్న ఖరీఫ్.. ధాన్యం రైతులకు కంటిపై కునుకు లేకుండా చేస్తోంది. అప్పోసప్పో చేసి పండించిన ధాన్యం అమ్ముకొనే దారి లేక అలాగే ఉంటే అప్పులెలా తీర్చాలి, ఖరీఫ్‌కు పెట్టుబడులెలా సమకూర్చుకోవాలి అనే ఆందోళన అన్నదాతలను ఆవరించింది. ఈ పరిస్థితులను తమకు అనుకూలంగా మార్చుకున్న దళారులు, వ్యాపారుల దోపిడీకి అంతే లేకుండా పోయింది.

### 60 లక్షల టన్నుల దిగుబడి

ఖరీఫ్‌లో విపత్తుల వలన నష్టాల పాలైన రైతులు నీటి వనరులు ఆశాజనకంగా ఉండటంతో రబీలో లక్ష్యాలకు మించి వరిని సాగు చేశారు. దాదాపు 20 లక్షల ఎకరాల్లో సాగు నమోదైంది. 60 లక్షల టన్నుల దిగుబడులొస్తాయని అంచనా వేశారు. ప్రతి గింజను కనీస మద్దతు ధర (ఎంఎస్‌పి)కు రైతుల చెంతనే, వారి కల్లాల్లోనే కొంటామనడంతో నిజమేనని రైతులు నమ్మారు. కాగా ప్రభుత్వ పథకాల కోసం పౌరసరఫరాల శాఖ రబీలో 45 లక్షల టన్నులను రైతుల నుండి సేకరించాలని టార్గెట్‌గా పెట్టుకుంది. ఇప్పటికి 15 లక్షల టన్నులనే కొనుగోలు చేసింది. దానిలో కూడా రైతుల నుండి కొన్నది కంటే మిల్లర్ల ద్వారా సేకరించిందే ఎక్కువ. మే నాల్గవ వారం రాగా తతిమ్మా 30 లక్షల టన్నులూ ఎప్పుడు కొంటుందో తెలీదు. అవి కాకుండా ఇంకా రైతుల వద్ద 10 లక్షల టన్నుల వరకు వున్నాయని అంచనా.

### బస్తాపై 300 వరకు కోత

'ఎ' గ్రేడ్ ఫైన్ క్వాలిటీ ధాన్యానికి క్వింటాలుకు సర్కారు ప్రకటించిన ఎంఎస్‌పి రూ.1,888. రైతువారీగా 76 కిలోల వంతున బస్తాను కాటా పెడతారు. ఎంఎస్‌పి రూ.1,435 దక్కాలి. కానీ రైతులకు రూ.1,150-1,200 కూడా పడట్లేదు. నాణ్యతా ప్రమాణాలు తగ్గితే రూ.వెయ్యి కూడా పడట్లేదు. ఆర్‌బికెల్లో ధాన్యం నాణ్యతను పరిశీలించి మిల్లర్లకు పంపితే అక్కడ నాణ్యత సరిగ్గా లేదని తిప్పి పంపుతున్నారు. 76 కిలోలలో పది కిలోల వరకు తరుగు తీస్తే కొంటామంటున్నారు. ఎగుమతి, దిగుమతి హమాలీ ఛార్జీలు, మిల్లర్ల వద్దకు అయ్యే రవాణా ఛార్జీలను రైతులే పెట్టుకోవాలి. ఇదిలా ఉండగా, ప్రభుత్వమే ప్రోత్సహించిన, కోఆపరేటివ్ సొసైటీలలో అమ్మించిన 1121, మరికొన్ని రకాల ధాన్యాన్ని మిల్లర్లు కొనట్లేదు. గింజ విరిగిపోతుందని వంకలు పెట్టి తిరస్కరిస్తున్నారు. కృష్ణా జిల్లా మైలవరం, కంకిపాడు, ఇతర ప్రాంతాల్లో ఈ సమస్య తీవ్రంగా ఉంది. ఇదే జిల్లాలో సివిల్ సప్లయిస్ అధికారులే మిల్లర్లకు అనుకూలంగా బస్తాకు రెండు కిలోల తరుగు తీసేందుకు అనుమతించారు. ఉభయగోదావరి, గుంటూరు, ప్రకాశం, నెల్లూరులోనూ పరిస్థితి ఇలాగే ఉంది.

### కౌల్దార్లది మరీ దైన్యం

కౌలు రైతులకు తప్పనిసరిగా గుర్తింపు కార్డు (సిసిఆర్‌సి) వుండాలన్న నిబంధన వారిని నట్టేట ముంచింది. రికార్డుల్లో ఎక్కలేదని ఆర్‌బికెలలో రిజిస్ట్రేషన్లు చేయట్లేదు. సిసిఆర్‌సిలులేని లక్షల మంది రైతులు భూమి యజమానుల పేర్ల మీద ధాన్యాన్ని అమ్ముకుంటున్నారు. అన్ని పెట్టుబడులూ పెట్టి, శ్రమించి పండించిన పంటను యజమానుల పేర్ల మీద, అదీ ఓనర్ల బ్యాంక్ అకౌంట్‌లో రొక్కం జమ కావడం కౌలు రైతులను కుంగదీస్తోంది. ఇదే అదనుగా యజమానులు కౌలు రైతుల పాత బకాయిలను వడ్డీలతోసహా మినహాయించుకొని మిగిలినవి ఇస్తున్నారు. ధాన్యం కొనుగోళ్ల సమస్యపై మే 24న విజయవాడలోని సివిల్ సప్లయిస్ మేనేజింగ్ డైరెక్టర్ కార్యాలయం ఎదుట ఆందోళన చేపట్టామని ఏపి కౌలు రైతు సంఘం కార్యదర్శి పి జమలయ్య తెలిపారు.



# రైతు పక్షపాతం ఇదా!

మనది కేవలం సాగు పైనే ఆధారపడ్డ రాష్ట్రం. కొన్నేళ్లుగా దేశంలో వ్యవసాయ సంక్షోభం తిష్ట వేసింది. దానికి కోవిడ్ మహమ్మారి, వంటి ఉపద్రవాలు తోడై సాగు రంగం పైనా, రైతుల పైనా దుష్పరిణామాలు కలిగిస్తున్నాయి. ఇలాంటి ఆపత్కాలంలో ప్రభుత్వం రైతుల వైపు నికరంగా నిలబడి ఇతోధికంగా బడ్జెట్ నిధులు వెచ్చించాలి. కానీ బడ్జెట్‌లో వ్యవసాయం, అనుబంధ రంగాలకు ప్రభుత్వ ప్రతిపాదనలు నిరాశా నిస్పృహల్లో ఉన్న అన్నదాతల్లో ఆత్మ విశ్వాసం నింపే విధంగా లేవు. ముందటేడు బడ్జెట్‌లో వ్యవసాయ పద్దు ఖర్చు 4.04 శాతం. నిరుడు సవరించిన అంచనాల్లో 5.75 శాతం ఉండగా ఇప్పుడు 5.88 శాతం అంటున్నారు. ప్రభుత్వం మాత్రం తమది రైతు పక్షపాత పాలన అని చెప్పుకుంటోంది. సర్కారు ప్రచారం ఎంత మోసపూరితమో వ్యవసాయ ప్రగతి నివేదికను తేరిపార చూస్తే ఇట్టే అర్థమవుతుంది. నిన్నగాక మొన్న బడ్జెట్‌లో రైతుల అన్ని పథకాలకూ రూ.68 వేల కోట్లు ఖర్చు చేశామనగా, ప్రోగ్రెస్ రిపోర్టులో లబ్ధిని రూ.85 వేల కోట్లకు పెంచేశారు. పోనీ ఆ అంకెలైనా నమ్మశక్యమా అంటే అదీ లేదు. వచ్చే నాలుగేళ్ల కాలానికి ఉచితంగా బోర్లు వేసేందుకు ఖర్చు చేయబోయే మొత్తాన్నీ ఖర్చు చేసినట్లు చూపించారు. ఉచిత విద్యుత్‌కు రెండేళ్లలో ప్రతిపాదించిన నిధులు రూ.9 వేల కోట్లు కాగా రూ.17,430 కోట్లు ఖర్చు పెట్టామన్నారు. పంటలకు గిట్టుబాటు ధరలకైతే ఏకంగా రూ.33 వేల కోట్లు ఖజానా నుండి ఇచ్చారట. ఇలాంటి చమత్కారాలెన్నో బడ్జెట్‌లో, ప్రగతి నివేదికలో నిక్షిప్తం అయ్యాయి.

నిరుడు, ఈ ఏడు కరోనా లాక్‌డౌన్లు, ఆంక్షల వలన రబీ పంటల మార్కెటింగ్‌కు తీవ్ర ఇబ్బందులేర్పడ్డాయి. ప్రస్తుతం వరి ధాన్యం సహా పలు పంటలను రైతుల నుండి కొనే నాథుడే లేడు. ఉల్లి, టమాటా, పసుపు, పత్తి, అరటి, మామిడి, బత్తాయి వంటి పంటల ధరల్లో స్థిరత్వం లేదు. ఇలాంటప్పుడు పంటల కొనుగోలుకు అధిక నిధులు సమకూర్చి ప్రభుత్వం జోక్యం చేసుకొని రైతులకు నష్టం లేకుండా ఆదుకోవాలి. కానీ ధరల స్థిరీకరణ నిధి రూ.3 వేల కోట్ల నుండి రూ.500 కోట్లకు కుదించడం ఎవరికి లాభం? రాష్ట్రంలో 92 శాతం రైతులు రుణగ్రస్తులని నేషనల్ శాంపిల్ సర్వే తేల్చగా, సున్నా వడ్డీ పథకానికి రూ.1,100 కోట్ల నుండి 500 కోట్లకు నిధులు తగ్గించారు. రైతులు సబ్సిడీ విత్తనం అడుగుతుండగా అందుకు నిధులను 192 కోట్ల నుండి వంద కోట్లకు కోత పెట్టారు. అరకొర రైతు భరోసా సాయం, నడవలేక నడుస్తున్న 'ఆర్‌బికె' లే రైతుల సమస్త సమస్యలకూ మందు అనడం రైతులను తప్పుదారి పట్టించడమే.

రైతులంతా వ్యతిరేకిస్తున్న నూతన వ్యవసాయ చట్టాలను రాష్ట్రంలో వేగంగా అమలు చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం అడుగులేస్తోంది. సాగుపై ప్రత్యేక పాలసీ, భారీ యాంత్రీకరణ, గ్రామాల్లో మల్టీ పర్పస్ ఫెసిలిటీ సెంటర్లు, ఉపాధి హామీ అనుసంధానం, సహకార సంస్కరణలకు సై అంది. రైతులు తమకు నాణ్యమైన విత్తనాలు, ఎరువులు, తక్కువ వడ్డీపై బ్యాంక్ పరపతి, పండించిన పంటలకు గిట్టుబాటు ధర అడుగుతుండగా ప్రభుత్వం అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తోంది. 70 శాతం భూమిని సాగు చేస్తున్న లక్షలాది కౌలు రైతులకు ఊతం ఇవ్వాల్సిన సర్కారు, వారికి ఇంతకు ముందు పరిమితంగానైనా ఉన్న చట్ట బద్ధ హక్కులను కొత్త చట్టం పేరిట తొలగించింది. దాంతో ప్రభుత్వం ఖర్చు చేసే కొద్దిపాటి నిధులూ వాస్తవ సాగుదార్లకు దక్కట్లేదు. వ్యవసాయ రాష్ట్రానికి జీవాధారమైన ఇరిగేషన్ పద్దుకు నిధులు తగ్గుతున్నాయి. ఆ దుష్పరిణామం ఆర్థిక సర్వేలో ప్రస్ఫుటించింది. ప్రాజెక్టుల కింద నికర సాగు రెండేళ్లలో ఏ మాత్రం పెరగలేదు. ఆహారోత్పత్తుల దిగుబడులు ముందటేడు కంటే నిరుడు ఏడు లక్షల టన్నులు తగ్గాయని పేర్కొని సాగును పండగ చేశామన్న సర్కారు ప్రచారానికి సర్వే చెంపపెట్టయింది. ఆత్మహత్యలు సరేసరి. వ్యవసాయం పండగ కావాల్సింది రైతులకు. ప్రభుత్వ ధోరణి కార్పొరేట్లకు పండగ చేసేదిగా తయారైంది. ఈ పోకడ నుండి సర్కారు వెనక్కి మళ్లకపోతే సాగు సంక్షోభం ఇంకా తీవ్రమవుతుంది.

**- కె.ఎస్.వి. ప్రసాద్**



# వ్యవసాయ రసాయనాల పేర్ల గారడీ



ప్రొఫెసర్ ఎన్. వేణుగోపాలరావు
సెల్ : 9490098905

(గత సంచిక తరువాయి)

పురుగు, తెగులు, కలుపుగడ్డి వంటి వాటిని అదుపుచేయడానికి లేదా నిర్మూలించడానికి మనం వాడుతున్న రసాయనాల పేర్లను ఇంతకుముందు సంచికల్లో తెలుసుకున్నాం. ఒక్కో రసాయనాన్ని ఎన్ని రకాల పేర్లతో అమ్ముతున్నారో కూడా చూశాం. వీటితోపాటు పంట మొక్కల పెరుగుదల, పూత, పిందె, కాయల వ్యక్తీకరణలపై ప్రభావం చూపగల రసాయనాలు రూపొందాయి. అంటే అవి మొక్కల పోషకపు హార్మోన్లపై పనిచేసి వాటి మూల లక్షణాలను కూడా మార్చగలవు. ఆ మధ్య వరకూ అవి మన దేశంలో అరుదుగా వాడేవారు. ఈ మధ్య వాటి వాడకం, ముఖ్యంగా ఉద్యాన పైర్లపై పెరిగింది. ఫలితంగా అనేక కంపెనీలు వివిధ వ్యాపార పేర్లతో వాటిని అమ్ముతున్నాయి. వాటి వివరాలు క్లుప్తంగా తెలుసుకుందాం.

**1. ఎన్.ఏ.ఏ.గా గుర్తించిన ఆల్ఫానాప్తలిక్ అసిటిక్ ఆసిడ్ 4.5 శాతం ఎస్.ఎల్ :** ప్లానో ఫిక్స్ (బేయర్), ఎసిమోన్ (దేవీదయాళ్), సూపర్ ఫిక్స్ (ఇండోఫిల్), అనమోల్ (ఐఐఎల్), ఫ్రూటోఫిక్స్ (కిల్‌పెస్ట్)

**2. ఎమైనో ఆసిడ్ :** ఇసాబయోన్ 62.5 శాతం (సిజెంటా), ఫెన్‌టాక్ ప్లస్ (కోరమాండల్), ఫ్రూట్ ఎనర్జి 5 శాతం (ఇండోఫిల్), ఐశ్వర్య గ్రాన్యూల్స్ (ఇపిఎల్), దేవీమోనో (దేవీదయాళ్), టోయో (లిమాక్స్), సుమినొ (సుమిల్), ఎమరాల్డ్ (సల్ఫర్‌మిల్స్)

**3. ఆస్కోఫిల్లం నొడోసమ్ (మైక్రోఫర్టిలైజర్ ) :** బొవిటో (పిఐ ఇండి), ఎగ్రోపెర్ట్ (సాయినాథ్ ఎగ్రో- లెట్స్

**4. క్లోర్‌మిక్వాట్ క్లోరైడ్ 50 ఎస్.ఎల్ :** లివోసిన్ (బిఏఎస్ఎఫ్0, లేయర్ (ఎల్లో ఉడ్),

**5. సైటోకైనిన్ ఎంజైమ్ :** పౌషక్ సూపర్ (కెఆర్)

**6. ఇతెఫాన్ 39 శాతం ఎస్.ఎల్ :** ఇత్రెల్ (బేయర్), క్రిపోన్ (కె.ఆర్.), ఇథెఫోన్ / దేవి ఫోన్ (దేవీదయాళ్), టాగ్ ఫోన్ 10 . టాప్‌గొన్ 39 (ట్రాఫికర్), ఇథెసాల్ (ఇండోఫిల్), బైసన్ (కానరి) ఆర్ష్ (అంబర్)

**7. జిబ్బరలిక్ ఏసిడ్ టెక్ :** పొజిబ్ (సుమిటోమొ), జైజిబ్ (కెఆర్), దేవిజిబ్ (దేవీదయాళ్), జిబ్రా (సుమిల్), ప్రైమ్ (ఐఐఎల్), టాగ్‌జిబ్ (ట్రాఫికల్), సిల్ - జిబ్ (కెమినోవా), క్రిగిబ్ (కెఆర్), క్రిగిబ్ (క్రిస్టల్), విల్‌జిబ్ (విల్ ఉడ్)

**8. జిబ్బరవిక్ ఏసిడ్ 0.01 శాతం :** హెూషి (సుమిటొమొ), ప్రైమ్‌గోల్డ్ (పెరల్), గురు (ఐపిఎల్), లిర్డ్ (అంబర్)

**9. నాన్ -ఐమోనిక్ సర్ఫెక్టెంట్ :** శాండోవిట్ (సింజెంటా), దేవిఫిక్స్ (దేవీదయాళ్), విల్‌కాన్ (విల్ ఉడ్), సిల్కి (కెఆర్), ఫిల్‌వెట్ (ఇండోఫిల్)

**10. పెక్లోబ్యుట్రాజోల్ 23 ఎస్.సి. :** కల్టార్ (సింజెంటా), పాక్లొ (ఐపిఎల్), కాన్‌స్టార్ (కానరి)

**11. సీవీడ్ ఎక్స్‌ట్రాక్ట్ :** హిల్ గ్రొ (హెచ్ఐఎల్), కికెల్ప్ అండ్ క్రిగోల్డ్ సూపర్ (కెఆర్),

**12. స్టిగ్మాసెరాల్ 0.1 శాతం + కాంపస్టెరాల్ 0.05 శాతం :** బ్రాండ్ అండ్ బ్రాండ్ జిఆర్ (విల్ ఉడ్)

**13. సల్ఫర్ 90 శాతం బెంటోనైట్ పెస్టయిల్స్ :** దేవీ జ్వాలా (దేవీదయాళ్)

**14. ట్రైకాంటనాల్ 0.1 శాతం ఇ.డబ్ల్యు :** మిరకిల్ (కెమినోవ), పిసిబూమ్ (పిసిసిపిఎల్), ఫైటవర్ 0.1 (విల్ ఉడ్), తారు (అంబర్), బిల్‌సాన్ (భారత్)

**15. ట్రైకాంటనాల్ 0.05 శాతం ఇ.సి. :** మొరాక్యులాన్ (డౌ),

కాంటినెంటల్ ఇసి (ఐపిఎల్), టానికి జిఆర్ (అంబర్), ఎగ్రిక్యులాన్ (ఎడిఎల్)

వీటితోపాటుగా అనేక రసాయన మందులను ముఖ్యంగా ఎలుకలను, ఎంటు పీతలను, భూమి బొరియలు చేసే వివిధ రకాల జీవులను, గింజ నిల్వకు అంతరాయం కలిగించే అనేక రకాల జీవులను హతమార్చేందుకు కృత్రిమ రసాయనాలను వివిధ వ్యాపార పేర్లతో అమ్మడాన్ని చూస్తున్నాం. దేశంలో 2013 వరకూ ఈ తరహా రసాయన మందులను సుమారు 98 కంపెనీలు అమ్ముతున్నాయి. వాటి ప్రచారం కోసం వేల కోట్లు ఖర్చుపెట్టి రైతులకు భ్రమలు కలిగిస్తున్నాయి. అంతర్జాతీయ, జాతీయ నియంత్రణా వ్యవస్థలను బేఖాతర్ చేసి వ్యాపారం నడుపుతున్నాయి. పర్యావరణ, ప్రజారోగ్య రక్షణ అనేవాటిని శుష్క నినాదాలుగా మార్చాయి. అందువల్లే వాటిని "గారడీ" వ్యాపార వస్తువులుగా పేర్కొనడం జరుగుతున్నది. దాదాపు ఇటువంటి ఒరవడే మనుషుల వైద్యానికి వాడే మందుల విషయంలోనూ చూస్తున్నాం. వీటన్నిటినీ పేటెంట్ (గుత్తసొమ్ము) చట్రంలో బిగించే కార్పొరేట్ కంపెనీలు లాభాల వేటలో ఉన్నాయి. తాజాగా కోవిడ్ – 19 టీకా మందు విషయాన్నీ చూస్తున్నాం. వాటిని తయారు చేసిన కంపెనీలు అవి తమ గుత్త సొమ్ముగా భావించి ప్రజలకు అమ్ముతున్నాయి. ఈ విషయంలో ధనిక దేశాల రాజకీయ నాయకులు కూడా నిస్సహాయంగా మారడాన్ని చూస్తున్నాం. ప్రపంచంలో యుద్ధ సామగ్రితో సమానంగా మనుషుల మందులు, వ్యవసాయ రసాయనాలు లాభాలను కూర్చి పెడుతున్నాయి. వీటిని రూపొందించే శాస్త్రవేత్తలు, వైజ్ఞానిక రంగ నిపుణులు కూడా కంపెనీలకు బానిసలుగా మారుతున్న దశను చూస్తున్నాం. ఇది "ధనికస్వామ్య" లక్షణమని తేలింది.

### ఈ గారడీ ధోరణులు ఆగేదెలా?

రెకెల్ కార్సన్, సునీతా నారాయణ్, సుమన్ సహాయ్, వందనా శివ, సుందర్‌లాల్ బహుగుణ, సతీష్ రామాంజనేయులు, నమ్మాళ్వార్, భాస్కరసావె వంటి పర్యావరణ రక్షణ ఉద్యమకారులు, ప్రత్యామ్నాయ వ్యవసాయ విధాన రూపకర్తలు తమ తమ స్థాయిలో ఈ వ్యవసాయ రసాయనాల గారడీని కొంత అడ్డుకునే ప్రయత్నాలు చేశారు. చేస్తున్నారు. ఈ సందట్లో ప్రకృతి వ్యవసాయం పేరుతో నడిచే మరొక ప్రహసనం (కృత్రిమ రసాయనాలు, నూతన విత్తనాలు అవసరంలేని సాగు) ముందుకొచ్చింది. ఇదొక ప్రత్యామ్నాయంగా కొందరు వ్యక్తులు, ప్రభుత్వాలు, వ్యాపారులు, భుజంపై వేసుకొని ప్రచారం మొదలుపెట్టారు. కార్పొరేట్ కంపెనీల వారు కూడా తామేదో ప్రజారోగ్య, పర్యావరణ రక్షకులైనట్లు దీంట్లో చేరి జీవ రసాయనాల వ్యాపారాలను నడపడాన్ని చూస్తున్నాం. అయినా కృత్రిమ రసాయనాల వ్యాపార గారడీ పెరగడమేగాని తరగడమే లేదు. ప్రతి సంవత్సరం కొత్త రసాయన వ్యాపార కంపెనీలు వెలుస్తూనే ఉన్నాయి. ప్రభుత్వ నియంత్రణా వ్యవస్థలను నిర్వీర్యం చేస్తూనే ఉన్నాయి. వాటి వ్యాపారం రోజురోజుకూ పెరగడమేగాని తరగడం లేదు. ఆఖరికి ప్రపంచ స్థాయి పర్యావరణ పరిరక్షణా సంస్థల నియమాలను తుంగలో తొక్కి తమ లాభాల వేట కొనసాగిస్తున్నాయి. భయంకర విష రసాయనాలను సస్యపోషణ, సస్యరక్షణ పేరుతో రైతులతో వాడిస్తున్నారు. హరిత విప్లవాన్ని వక్రీకరిపజేశారు.

### స్వామినాథన్, రతన్‌లాల్ వంటి వ్యవసాయ శాస్త్రవేత్తలు చూపుతున్న దారి

వ్యవసాయ విప్లవానికి.. ఆహార సముపార్జనలో ప్రపంచానికి దారి చూపిన వారికి ప్రపంచ ఆహార పురస్కారం (వరల్డ్ ఫుడ్ ప్రైజ్) ఇవ్వడం ఆనవాయితీ. ఆ పురస్కారం మొదటిగా అందుకున్న ప్రొఫెసర్ స్వామినాథన్, ఈ మధ్య (2020లో) అందుకున్న ప్రొఫెసర్ రతన్‌లాల్ హరిత విప్లవం ద్వారా జరిగిన నష్టం.. అంటే విత్తనాలు, కృత్రిమ రసాయనాలు కేంద్రంగా నడిచే ఒరవడిని సూచించారు. ప్రొఫెసర్ స్వామినాథన్ తన జాతీయ రైతు కమిషన్ నివేదిక ద్వారా శ్రమ విలువను గుర్తించగల వ్యవసాయ ఉత్పత్తుల గిట్టుబాటు మార్కెట్ ధరను శాస్త్రీయంగా సూచించారు. అలాగే ప్రొఫెసర్ రతన్‌లాల్ భూమి, జీవన ఉత్పత్తి వనరుగా గుర్తించే వ్యవసాయ విధానాలను సూచించారు. అంటే 21వ శతాబ్దంలో శ్రమ , భూమి (మట్టి) కేంద్రంగా వ్యవసాయం నిలిస్తేనే ఈ రసాయనాల, విత్తనాల గారడీ పాత్ర తగ్గదు. కనుక ఈ సంస్కరణ మనం రైతు సంఘాల ఉద్యమాల ద్వారా, అసలైన రైతుల ద్వారా అమలు చేయించాలి. అప్పుడే గారడీ వ్యాపార కంపెనీలకు అడ్డుకట్ట వేయగలం. అసలైన హరిత విప్లవాన్ని చూడగలం.

## సుందరయ్య పోరాట స్ఫూర్తితో
## రైతాంగ ఉద్యమాన్ని కొనసాగించాలి : విజూ

సుందరయ్య పోరాట స్ఫూర్తితో రైతాంగ ఉద్యమాన్ని ముందుకు తీసుకువెళ్లాలని, రైతాంగ ఉద్యమం విజయవంతం కావాలంటే పోరాటాన్ని మరింత ఉధృతంగా నిర్వహించడమే సుందరయ్యకు నిజమైన నివాళి అని ఆల్ ఇండియా కిసాన్ సభ జాతీయ సహాయ కార్యదర్శి విజూ కృష్ణన్, వ్యవసాయ కార్మిక సంఘం జాతీయ ప్రధాన కార్యదర్శి బి.వెంకట్ అన్నారు. కౌలు రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు వి.శ్రీనివాసరావు అధ్యక్షతన సుందరయ్య 36వ వర్ధంతి సభ ఆన్‌లైన్‌లో జరిగింది. ఈ సందర్భంగా 'రైతు ఉద్యమం –ప్రస్తుత పరిస్థితి' అనే అంశంపై సెమినార్ నిర్వహించారు. ఒక వైపు కరోనాతో ప్రజలు అల్లాడుతుంటే కేంద్ర ప్రభుత్వం రైతులకు నష్టం చేకూర్చే విద్యుత్తు సంస్కరణల బిల్లుపై రాష్ట్రాల నుంచి అభిప్రాయాలను సేకరించడం దారుణమని విజూకృష్ణన్, వెంకట్ అన్నారు. ఏపి రైతు సంఘాల సమన్వయ కమిటీ రాష్ట్ర కన్వీనర్ వడ్డే శోభనాద్రీశ్వరరావు మాట్లాడుతూ సుందరయ్య జీవితం అందరికీ ఆదర్శమన్నారు. సుందరయ్య నాయకత్వం వహించిన తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం దేశంలో వ్యవసాయ సమస్యకు పరిష్కారం చూపిందన్నారు. ఇంకా సభలో వివిధ రైతాంగ, కార్మిక సంఘాలకు చెందిన రావుల వెంకయ్య, ప్రొఫెసర్ ఎన్.వేణుగోపాలరావు, సింహాద్రి ఝాన్సీ డి.హరినాథ్, మర్రెడ్డి శ్రీనివాసరెడ్డి, ఆళ్ల గోపాలకృష్ణారావు, వి.వెంకటేశ్వర్లు, వై.కేశవరావు, మర్రాపు సూర్యనారాయణ, పి.జమలయ్య తదితరులు ప్రసంగించారు.

# డ్రాగన్ పండ్ల తోటలు



పేద ప్రజలతోపాటు రైతులను కూడా మోసం చేయడం కార్పొరేట్లకు అలవాటుగా మారింది. ఈ కారణంగా రైతులు ప్రత్యామ్నాయ పంటలను వెతుక్కోవడం అయింది. అందులో భాగమే ఈ డ్రాగన్ పండ్లతోటల సమాచారం.




సంగిరెడ్డి హనుమంత రెడ్డి

సెల్ : 94 90 20 45 45


### డ్రాగన్ పండ్ల చెట్ల వివరాలు

డ్రాగన్ జెముడు జాతికి చెందిన నిటారుగా పెరిగే ఉష్ణ మండల చెట్టు. కాక్టేసియే వృక్ష జాతి చెట్టు. డ్రాగన్ చెట్టు పితయ, పితాహయ, స్ట్రాబెరీపీర్ అని అనేక పేర్లతో పిలవబడుతోంది. రాత్రుళ్లు పూలు పూచే ఈ డ్రాగన్ చెట్టును హెూనొలులు రాణి, కులీన మహిళ, రాత్రి రాణి అని ముద్దు పేర్లతో పిలుస్తారు. హవాయి రాజధాని హెూనొలులు రాత్రి జీవితాలకు, రాత్రి అమ్మకాలు, కొనుగోళ్లకు ప్రసిద్ధి. అందుకని ఈ చెట్టుకు హెూనొలులు రాణి అన్న అడ్డ పేరు పెట్టారు. ఇది దక్షిణ-మెక్సికో మధ్య-అమెరికా ప్రాంతాల ఎడారి రకం చెట్టు. ఇటీవల బాగా ప్రచారం పొంది ప్రపంచమంతా పెంచబడుతోంది. నేరేడు రకానికి చెందిన పండ్లను పీర్ అంటారు. అతి సాధారణ రకాల డ్రాగన్ పండ్లకు ప్రకాశవంతమైన ఎర్రని చర్మం, వాడి మొనలతో కూడిన ఆకుపచ్చ పొలుసులు ఉంటాయి. ఆ విధంగా డ్రాగన్‌ను పోలి ఉండడంతో డ్రాగన్ పండు అని పేరు. 1963లో ఈ పేరు స్థిరపడింది. తోక కలిగి నోటి నుండి మంటలు కక్కుతూ ఉండే భయంకర జంతువు డ్రాగన్. ఈ జంతువును అధికారం, బలం, అదృష్టానికి గుర్తుగా భావిస్తారు. చైనీయులు దీన్ని బాగా నమ్ముతారు. ఇష్టపడతారు. అందుకే చైనాను పరోక్షంగా డ్రాగన్ అని ప్రస్తావిస్తారు. విస్తృతంగా లభించే రకం డ్రాగన్ పండులో తెల్లని గుజ్జు, నల్లని విత్తనాలు ఉంటాయి. ఎర్రని గుజ్జు, నల్లని గింజల రకాలు కూడా అరుదుగా దొరుకుతాయి. మరొక రకం పసుపు డ్రాగన్ పండులో పసుపు పచ్చ తొక్క తెల్లని గుజ్జు, నల్లని గింజలు ఉంటాయి. పసుపు డ్రాగన్ పండు ఇతర రకాల కంటె కొంచెం చిన్నదిగా, అతి తియ్యగా ఎక్కువ రసం కలిగి ఉంటుంది. ఇతర రకాల కంటే ఇది శ్రేష్టమయిందని అంటారు. డ్రాగన్ పండు కొత్తగా, వింతగా కనిపించవచ్చు. కాని దాని రుచి, వాసనలు ఇతర పండ్ల లాగానే వుంటాయి. వివరంగా చెప్పాలంటే కొద్దిగా తియ్యగా ఉంటుంది. దాని రుచి వాసనలు కివి, పీర్ పండ్ల రుచి వాసనలకు మధ్యస్థంగా అంటే అవి రెండూ కలిసినట్లు ఉంటాయి. ఇంకా మన పుచ్చకాయ రుచి లాగా ఉంటుంది. వృక్షశాస్త్రంలో డ్రాగన్ జెముడుచెట్టును హైలొసెరియస్ జాతి, స్టెనోసెరియస్ జాతి అని రెండు రకాలుగా విభజించారు. హైలొసెరియస జాతి చెట్లు ఒకమోస్తరు వర్షంతో ఉప ఉష్ణమండల వాతావరణంలో బతుకుతాయి. స్టెనోసెరియస్ జాతి చెట్లు అమెరికా దేశాలలో బాగా పెరుగుతాయి. స్టెనోసెరియస్ రకం

డ్రాగన్ పండ్లు పుల్లగా ఎక్కువ రసంతో వుంటాయి. హైలొసెరియస్ రకం పండ్లు 150 నుండి 600 గ్రాముల బరువు వుంటాయి. కొన్ని కిలో బరువు పెరుగుతాయి.

తొక్క రంగు ప్రకాశవంతంగా మారి, నొక్కితే మెత్తగా ఉంటే డ్రాగన్ పండు పండినట్లు లెక్క. దీన్ని నిలువుగా కోసి చెంచాతో గుజ్జు తీసి తినవచ్చు. లేదా చెక్కు తీసి, తర్వాత నిలువునా కోసి తినవచ్చు. ముక్కలు అలాగే తినవచ్చు. వేరుశనగ విత్తనాలు, జీడిపప్పులు వంటి పప్పులతో పెరుగులో కలుపుకొని తినవచ్చు. ఇతర కూరగాయలు, పండ్లతో కలిపి సాలాడ్ చేసుకొని తినవచ్చు. డ్రాగన్ పండు తొక్క తినడానికి పనికిరాదు. బయటి వాతావరణంలో డ్రాగన్ పండు కొద్ది రోజుల పాటు పాడు కాకుండా వుంటుంది. ఎక్కువ రోజులు నిలవ ఉండాలంటే రంధ్రాలున్న ప్లాస్టిక్ సంచులలో పెట్టి ఫ్రిజ్ లో ఉంచాలి.

డ్రాగన్ పండు ఖరీదు అమెరికాలో కనీసం 10 డాలర్లు (సెప్టెంబర్ 24 నాటి మారక విలువ ప్రకారం 736 రూపాయలు). భారత్‌లో దీని టోకు ధర రూ.210 నుండి రూ.550ల వరకు ఉంది. ఇది మన దేశంలో ఇంకా పూర్తి స్థాయిలో పండటం లేదు. అందువలన డ్రాగన్ పండ్లను విదేశాల నుండి దిగుమతి చేసుకుంటున్నారు. సంపన్నులు వినియోగిస్తున్నారు. ఈ కారణం వలన దీని ఖరీదు ఎక్కువ. డ్రాగన్ చెట్లను పెంచే దేశాలన్నిటికంటే వియత్నాం ఎక్కువ విస్తీర్ణంలో అంటే 55,000 హెక్టార్లలో (1,37,500 ఎకరాలలో) డ్రాగన్ పండిస్తుంది. పెద్ద సంఖ్యలో పండ్లు ఎగుమతి చేస్తుంది. థాయిలాండ్, తైవాన్, ఫిలిప్పైన్స్, మలేషియా, శ్రీలంక, ఆస్ట్రేలియా, ఇజ్రాయిల్, దక్షిణ అమెరికా దేశాలైన మెక్సికో, ఈక్వడార్, కొలంబియా, నికరాగువ, గ్వాటమాల దేశాలు తర్వాతి స్థానాల్లో వున్నాయి.

## సాగు పద్ధతి

మచ్చలు లేకుండా బాగా పండిన శ్రేష్ఠమైన డ్రాగన్ పండ్ల గుజ్జు నుండి విత్తనాలను వేరుచేసి శుభ్రం చేస్తారు. ఈ గింజలను ఎండబెట్టి నిలువ చేస్తారు. సేంద్రీయ ఎరువుల మిశ్రమం (కాంపోస్ట్)లో ఈ విత్తనాలను మొలకెత్తిస్తారు. వీటిని ఇళ్ళలో కుండీలలో కూడా మొలకెత్తించవచ్చు. ఇతర జెముడు చెట్ల లాగే బాగా ఆరోగ్యకరంగా పెరిగిన డ్రాగన్ చెట్ల నుండి కాండం ముక్కను భూమిలోకి గాని కుండీలో గాని తొక్కితే దానికి వేర్లు పుట్టి స్వతంత్ర మొక్కగా ఎదుగుతుంది. ఆ అంటు మొక్కను కావలసిన చోట నాటు కోవడం మరొక సాగు పద్ధతి. డ్రాగన్ చెట్ల పెంపకానికి కావలసిన కాంక్రీటు స్తంభాలు, స్టీల్ బకెట్లను సిద్ధంగా ఉంచుకోవాలి. అన్ని పంటలకు మాదిరిగానే పొలాన్ని తయారు చేసుకోవాలి. అనగా దున్నడం, గొర్రు తోలడం, గుంటక పాయడం వంటి పనులు చేసి పెట్టుకోవాలి. అప్పుడు విత్తనాలు విత్తడమా లేక మొక్కలు నాటడమా నిర్ణయించుకొని ఆ పద్ధతిలో డ్రాగన్ చెట్ల పెంపకం మొదలు పెట్టాలి. మొక్కలు నాటుకునే పద్ధతిని సహజంగా చాలా మంది అనిసరిస్తారు. డ్రాగన్ చెట్లు వేడి, తడి వాతావరణంలో అతి తక్కువ నీటితో పెరుగుతాయి. ఇవి జెముడు జాతి మొక్కలు కాబట్టి ఎక్కువ నీళ్ళు అవసరం లేదు. రోజుకు కనీసం ఆరు గంటల పాటు ఎండ ఉండాలి. జెముడు చెట్ల కంటే వీటికి ఎక్కువ ఇసుక ఉండాలి. సాధారణంగా 11-14 రోజులలో విత్తనాలు మొలకెత్తుతాయి. మొక్కలు పెరిగేకొద్దీ అవి ఎగబాకడానికి ఆధారం కావాలి. భూమి/మట్టి లోపలి వేర్లే గాక పైభాగాన శాఖలకు కూడా వేర్లు పెరుగుతాయి. డ్రాగన్ చెట్లు 70 అడుగుల ఎత్తు వరకు పెరుగుతాయి. వందల ఏళ్లు బతుకుతాయి. ఐతే 6 అడుగుల ఎత్తుకు పరిమితం చేస్తారు. మొక్కలు 6-8 నెలల వయసు రాగానే పూలు పూసే అవకాశముంది. ఐతే చెట్లు ఏపుగా పెరిగి శ్రేష్టమయిన పండ్లు కాయడానికి 2 ఏళ్లు పడుతుంది. పూర్తి వాణిజ్య ఉత్పత్తి దశకు రావడానికి 5 ఏళ్లు పడుతుంది.చెట్లు 20 ఏళ్లు పండ్లు కాస్తాయి. అరటి పెరిగే నేలలు, వాతావరణం డ్రాగన్ చెట్లకు కూడా అనుకూలమే. గరుగు, ఇసుక నేలలు మరింత అనుకూలం. ఏడాదికి 660 నుండి 1300 మిల్లి మీటర్ల వర్షపాతం సరిపోతుంది. 21-29 డిగ్రీల సెల్సియస్ ఉష్ణోగ్రతలో బాగా పెరుగుతాయి. గరిష్ఠంగా 38-41 డిగ్రీల సెల్సియస్ ఉష్ణోగ్రతలలో కూడా ఇబ్బందులు ఉండవు. కొద్దికాలం పాటు 1 డిగ్రీ సెల్సియస్ ఉష్ణోగ్రతను అంటే అంతటి చల్లదనాన్ని కూడా తట్టుకుంటాయి. అతి తక్కువ కాలం మంచును భరించగలవు. గడ్డకట్టే వాతావరణం ఎక్కువ కాలం ఉంటే మొక్కలు బతకవు. వరుసలలో కాంక్రీటు స్తంభాలమీద ఈ చెట్లను పెంచుతారు. స్తంభాల ఎత్తు భూమి మీద నుండి 6 అడుగులు ఉండాలి. అంటే



కనీసం 7, 8 అడుగుల పొడవు స్తంభాలు కావాలి. ఈ స్తంభాలను పాతడానికి 2 అడుగుల గొయ్యి తీయాలి. స్తంభాల మధ్యదూరం ఒక అడుగు సరిపోతుంది. ఒక్కొక్క స్తంభం మీద 4 చెట్లు పెంచవచ్చు. స్తంభాల పైన భూమికి సమాంతరంగా బోలు కాంక్రీటు రింగులు కాని, స్టీల్ అడ్డ పట్టీలు కాని కట్టాలి. వీటి మీద చెట్లు అడ్డంగా పెరిగి చివరలో భూమి వైపు వేలాడుతాయి. పండ్ల ఉత్పత్తి పూర్తిగా మొదలయేవరకు అంటే దాదాపు 5 ఏళ్ల పాటు డ్రాగన్ చెట్ల మధ్య అంతర పంటలు పండించవచ్చు. డ్రాగన్ పండ్ల తోటలకు బిందు సేద్యం ద్వారా నేరుగా చెట్టు వేర్లకు నీళ్ళు అందించవచ్చు.

సాధారణంగా ఎకరాకు 40 డ్రాగన్ చెట్లు నాటవచ్చు. వాణిజ్య ప్రయోజనాల కోసం పండించేవారు ఎకరాకు 540 చెట్లు నాటుతారు. ఎకరాకు 8 నుండి 12 టన్నుల పండ్లు కాస్తాయి. ఏడాది పొడవునా ఎప్పుడైనా ఈ చెట్ల పెంపకం మొదలు పెట్టవచ్చు. వేసవికాలం తొలి నాళ్ళ నుండి శరదృతువు మధ్య వరకు డ్రాగన్ చెట్లు పుష్పిస్తాయి. రాత్రి పూట మాత్రమే పూలు పూస్తాయి. మరుసటి రోజు సాయంత్రానికి వాడిపోతాయి. పర పరాగ సంపర్కం కోసం రాత్రి పూట తిరిగే గబ్బిలాలు, చిమ్మటలపై ఆధారపడతాయి. వాటితో పూల ఫలదీకరణ జరుగుతుంది. కొన్ని జాతులలో స్వయం పరాగ సంపర్కంతో పండ్ల ఉత్పత్తి జరగదు. కొన్ని స్వయం ఫలదీకరణ డ్రాగన్ వృక్ష జాతులలో ఒకే చెట్టు పర పరాగంతో ఫలదీకరణ జరుగుతుంది. ఇంకొక చెట్టు పూలతో పర పరాగం మంచి ఫలితాలను ఇస్తుంది. పండ్ల దిగుబడి, నాణ్యత పెరుగుతాయి. ఇళ్లలో కుండీలలో పరిమిత సంఖ్యలో డ్రాగన్ చెట్లు పెంచుకునేవారికి కొంత ఇబ్బంది కలుగుతుంది. చెట్లు తక్కువ ఉండటంతో పర పరాగం జరిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. చెట్లు పెరిగిన తీరును బట్టి ఏడాదికి 3 నుండి 6 సార్లు పూలు పూస్తాయి. 5, 6 పంటలు పండుతాయి. ఫలదీకరణ తర్వాత 30 నుండి 50 రోజుల్లో డ్రాగన్ పండ్లు తయారు అవుతాయి. కోసిన పండ్లను నీళ్ళతో కడిగి 24 గంటల సేపు ఆరబెట్టాలి. ఆరిన తర్వాత ప్రతి పండు చుట్టూ టిష్యూ కాగితం చుట్టి ముడతల అట్టపెట్టెలలో ఎగుమతి చేయాలి.

పంజాబ్ లో హర్బంత్ సింఘ్ అనే రైతు 2,500 చెట్లతో డ్రాగన్ పండ్ల తోటలు పెంచుతున్నారు. ఒకటింబాతిక ఎకరంలో 500 స్తంభాలు పాతారు. చెట్లు కాపుకు వచ్చినంత వరకు అంతర పంటగా జొన్న పండించారు. ఈయన తోటలో ఎకరానికి ఏడాదికి 40 క్వింటాళ్ల డ్రాగన్ పండ్లు కాశాయి. వాటిని టోకున కిలో రూ. 200 ల చొప్పున అమ్మారు. ఎకరాకు రూ. 8 లక్షల ఆదాయం వచ్చింది. గుజరాత్‌లో నీటి కొరతతో బాధపడుతున్న కచ్ జిల్లాలో విశాల్ దోడా అనే రైతు 15 ఎకరాలలో వియత్నాం పద్ధతిలో డ్రాగన్ పండ్ల తోటలు పెంచారు. ఈయనకు సిమెంట్ స్తంభాలు, సాగునీటి సౌకర్యాలు, కూలీల మీద మొత్తం ఎకరాకు రూ. 4 లక్షల ప్రారంభ ఖర్చు అయింది. ఈ ఖర్చు 2 ఏళ్లలో వచ్చేసింది. ఈయన డ్రాగన్ చెట్ల మొక్కలు కూడా సరఫరా చేస్తున్నారు. త్రిపురలో 57 ఏళ్ల పరిమళ్ దాస్ డ్రాగన్ పండ్ల తోటలు సాగు చేస్తున్నారు. హైదరాబాదులో ప్రఖ్యాత వైద్యుడు శ్రీనివాస్ రావు మాధవన్ 11 ఎకరాలలో ఈ పండ్లతోటలు పెంచుతున్నారు. హైదరాబాదుకే చెందిన 53 ఏళ్ల వ్యాపారవేత్త జి.సి. రెడ్డి చిత్తూరు జిల్లా మదనపల్లెలో 5 ఎకరాలలో పెద్ద ఎత్తున ఈ తోటలు పెంచుతున్నారు. ఈయన ఈ పండ్లను జర్మనీకి ఎగుమతి చేసే ప్రణాళికలు ఏర్పాటు చేసుకున్నారు.

కర్ణాటక రాష్ట్రం తుమకూరు జిల్లా హీరేహళ్లిలో పండ్ల తోటల పరిశోధన భారతీయ సంస్థ (ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ హార్టికల్చరల్ రీసర్చ్) డ్రాగన్ చెట్ల పెంపకం మీద విస్తృతంగా పరిశోధనలు చేసింది. తెలంగాణ, ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు, పశ్చిమ బంగ, ఒడిశా, మహారాష్ట్ర రాష్ట్రాల నుండి 300ల మంది పరిశోధకులు, రైతులు అధ్యయనం కోసం అక్కడి ప్రయోగాత్మక డ్రాగన్ పండ్లతోటను సందర్శించారు. ఇప్పటికీ వారానికి 100 మంది దాకా అధ్యయనం కోసం వస్తున్నారు. కర్ణాటకలో స్వయం సహాయక బృందాలు ఈ పండ్లతోటల పెంపకంలో ఆసక్తి చూపిస్తున్నాయి. కర్ణాటక రాష్ట్రంలో 1,000 ఎకరాలకు పైగా డ్రాగన్ పండ్లతోటలు పండిస్తున్నారు. మహారాష్ట్ర, పశ్చిమ బంగ రాష్ట్రాలలో ఈ పండ్లతోటలు పెంచడానికి కొందరు రైతులు ప్రయత్నిస్తున్నారు.

### డ్రాగన్ చెట్ల విత్తనాలు, మార్కెటింగ్

డ్రాగన్ చెట్ల విత్తనాలు, మొక్కలు దొరికే ప్రత్యక్ష సమాచారం అందుబాటులో లేదు. అయితే అమెజాన్ తదితర అనేక కంపెనీల విత్తనాలు, మొక్కలను ఆన్ లైన్‌లో ఆర్డర్ చేసిన 2, 3 రోజులలో పంపిస్తోంది. డ్రాగన్ చెట్ల విత్తనాలు పాకెట్లలో దొరుకుతాయి. ఒక్కొక్క పాకెట్ లో 10 నుండి 30 గింజలు ఉంటాయి. ఈ పాకెట్ల ధర రూ. 89 నుండి రూ. 166ల వరకు ఉంది. 4 నుండి 8 అంగుళాల ఎత్తున్న ఒక్కొక్క మొక్క ధర రూ. 160 నుండి రూ. 297ల వరకు వుంది. అమెజాన్ కంపెనీ కొన్ని షరతులతో విత్తనాలు, మొక్కల ధరలలో అనేక రాయితీలు ప్రకటించింది. కోల్కతా ఆర్చిడ్స్, జెనరిక్ డ్రాగన్ ఫ్రూట్, ఎం-టెక్ గార్డెన్స్, రాంబాగ్ ఫార్మ్ మొదలగు కంపెనీలు డ్రాగన్ పండ్ల చెట్ల మొక్కలను తయారు చేస్తున్నాయి. వీటిని సంప్రదించడానికి వీటిఫోన్ నంబర్లు, చిరునామా, అంతర్జాల వివరాల సమాచారం అందుబాటులో లేదు. అవి ఆన్ లైన్ లోనే అమెజాన్ ద్వారా విత్తనాలు, మొక్కలను సరఫరా చేస్తున్నాయి.

## మార్కెట్ చూసుకోకుండా పెంపకం వద్దు



డ్రాగన్ పండ్ల గురించి చాలా మందికి తెలియదు. మన దేశంలో మార్కెటింగ్ సౌకర్యాలు లేని ఏకైక పండు ఇదే. ప్రభుత్వాలు, రైతు సంఘాలు డ్రాగన్ పండ్ల ప్రయోజనాలు, తోటల పెంపకం సమాచారాన్ని విస్తృతంగా ప్రచారం చేయాలి. రైతులు మార్కెట్ సౌకర్యాలు చూసుకోకుండా డ్రాగన్ చెట్ల పెంపకం చేపట్టరాదు. రైతు సంఘాలు, సహకార సంస్థల సహాయ సహకారాలతో మార్కెటింగ్ సౌకర్యాలు పెంపొందించుకోవాలి. ఇప్పటికైతే ప్రభుత్వాలు డ్రాగన్ పండ్లతోటల పెంపకంపై శ్రద్ధపెట్టలేదు. ఎలాంటి చర్యలు చేపట్టలేదు.

## తెగుళ్ళు - నివారణ

ఫంగస్, బ్యాక్టీరియా, ఏలికపాముల వంటి పరాన్నజీవులు, వైరస్‌ల వలన డ్రాగన్ చెట్ల కాండాలకు, పండ్లకు అనేక తెగుళ్లు వచ్చే అవకాశం ఉంది. ఎక్కువగా నీళ్ళు పోయడం, అధిక వర్షాల వలన పూలు రాలిపోతాయి. పండ్లు కుళ్లిపోతాయి. జాంథొమోనాస్ కాంపెస్ట్రిస్బ్యాక్టీరియా వలన కాండాలు కుళ్లిపోతాయి. డోథిరెల్ల ఫంగస్‌తో పండ్ల మీద గోధుమరంగు మచ్చలు వస్తాయి. డ్రాగన్ చెట్లకు రోగ నిరోధక శక్తి ఎక్కువ. ఈ విదేశీ జాతి చెట్ల తెగుళ్ళకు మందులు లేవు. అవసరమైతే కాపర్ సల్ఫేట్ మిశ్రమం చెట్లపై చల్లవచ్చు. బొప్పాయి, అరటి చెట్లకు తీసుకునే జాగ్రత్తలు డ్రాగన్ చెట్లకు కూడా వర్తిస్తాయి. క్రమం తప్పకుండా కలుపు తీయాలి. పరిశుభ్రత పాటించాలి. చెట్లకు బూజు పట్టకుండా, పక్షులు గూళ్ళుపెట్టకుండా జాగ్రత్తగా గమనించాలి. వెంటనే వాటిని తొలగించాలి. క్రిమికీటకాలు, పురుగులు, చీమలు చెట్లపై తిరగకుండా చూసుకోవాలి. ఒకవేళ కనిపిస్తే వాటిని ఏరిపారేయాలి. లద్దె పురుగులు, పేడ పురుగులు, నత్తలు, గొంగళి పురుగులు రాకుండా చూడాలి. తెగులు సోకిన చెట్టు కాండాన్ని వెంటనే కత్తిరించి తొలగించాలి. ఏవయినా పురుగులు పారాడినట్లు అనుమానం రాగానే అధిక ప్రవాహంతో వేగంగా చెట్లపై నీళ్ళు కొట్టాలి. చెట్టును నీటితో కడగాలి. ఇళ్ళలో వాడే పురుగు మందులు ఈ చెట్లకూ వాడుకోవచ్చు. సాధారణ క్రిములు, కీటకాలకు తీసుకునే జాగ్రత్తలు ఈ చెట్లకు కూడా తీసుకోవాలి. నీళు ళ్ళ, ఎరువులు తగు మోతాదులో అందించాలి. దీనితో చెట్ల రోగ నిరోధక శక్తి పెరుగుతుంది.

## ప్రయోజనాలు

డ్రాగన్ పండు ఆకారం, దాని నల్లని కరకరలాడే విత్తనాలు కివి పండు ఆకారాన్ని, విత్తనాలను పోలి ఉంటాయి. ఇది చాలా ఆరోగ్య ప్రయోజనాలు కలిగిన పండు. ఇందులో తక్కువ మోతాదుల్లో అనేక పోషక పదార్థాలు ఉంటాయి. ఇనుము, మాంగనీసు లోహాలు, పీచు పదార్థాలు ఎక్కువ మోతాదులో ఉంటాయి. 100 గ్రాముల డ్రాగన్ పండులో 60 క్యాలరీల శక్తి, 1.2 గ్రాముల మాంసకృత్తులు, 13 గ్రాముల కర్బనాలు, 3 గ్రాముల పీచు, 3 శాతం చొప్పున సి విటమిన్, బి1, బి2, బి3 విటమిన్లు, 4 శాతం ఇనుము, 10 శాతం మాంగనీసు, 11 శాతం సున్నం ఉంటాయి. ఎక్కువ పీచు, మాంగనీసు, విటమిన్లతో, తక్కువ క్యాలరీలతో డ్రాగన్ పండు అధిక సాంద్రత పోషకాహార ఫలంగా పరిగణించబడుతోంది. ఈ పండులో అనేక రకాల యాంటీ-ఆక్సిడెంట్లు ఉంటాయి. ఇవి శరీర కణాలను క్షీణత, రోగాల నుండి రక్షిస్తాయి. ఈ పండు ఇన్సులిన్ స్థాయిని పెంచి మధుమేహ రోగం రాకుండా, కాలేయం పెద్దది కాకుండా కాపాడుతుంది. కొలెస్ట్రాల్ ను పరిమితంచేసి గుండె ఆరోగ్యాన్ని సంరక్షిస్తుంది. ఊబకాయాన్ని, కొవ్వు పదార్థాలను తగ్గిస్తుంది. రోగనిరోధక శక్తిని, లాభదాయక బ్యాక్టీరియాను పెంచుతుంది. రక్తపోటు తగ్గిస్తుంది. ఎముకలను, పండ్లను బలోపేతం చేస్తుంది. శ్వాసకోశ సమస్యలను తగ్గిస్తుంది. పుండ్లు, గాయాలను తొందరగా మాన్పుతుంది. కంటి చూపును కాపాడుతుంది. మలబద్ధకం, రక్తలేమిని తగ్గిస్తుంది. డ్రాగన్ పండ్లగుజ్జును రంగు, వాసన కోసం అనేక రసాలలో, మద్యపానీయాల్లో కలుపుతారు. వోడ్కా తయారీలో వాడతారు. డ్రాగన్ బ్లడ్ పంచ్, డ్రాగోటిని వంటి మద్య పానీయాలను తయారు చేస్తారు. డ్రాగన్ విత్తనాలతో నూనె తీస్తారు. ఈ నూనెలో ఒమేగా 3తోపాటు అనేక రకాల కొవ్వు ఆమ్లాలు (ఫ్యాటి యాసిడ్స్) ఉన్నాయి. డ్రాగన్ పూలను తింటారు. నానబెట్టి టీ లాగా తాగుతారు. అయితే డ్రాగన్ పండు ఖరీదుతో పోల్చితే ఈ ప్రయోజనాలు తక్కువ. సంపన్నులు కొని తినవచ్చు. రైతులు ఈ డ్రాగన్ చెట్లను పెంచి పండ్లతో అధిక లాభాలు పొందవచ్చు.

## ముగింపు

కేంద్ర ప్రభుత్వం గతేదాడి సెప్టెంబరు 20న వ్యవసాయ బిల్లులకు ఆమోదం పొందింది. బిల్లుల ఆమోద ప్రక్రియ ప్రజాస్వామ్యాన్ని హత్య చేసింది. రోజూ ఒకరినొకరు తిట్టుకునే మన రాష్ట్ర అధికార, ప్రతిపక్షాలు రెండూ రైతులకు వ్యతిరేకంగా ఈ బిల్లులకు మద్దతు తెలిపి ప్రభుత్వానికి సహకరించాయి. ఈ చట్టాలతో రైతుల కాయకష్టం కార్పొరేట్ల పాలవుతుంది. రైతులు తమ ఆదాయ పెంపుదలకు ప్రత్యామ్నాయ పద్ధతులతో తమ వంతు కృషిని కొనసాగిస్తూనే ప్రభుత్వ రైతు విరుద్ధ విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమించాలి.

**వ్యాస రచయిత**

**ఆల్ ఇండియా ప్రోగ్రెసివ్ ఫోరం జాతీయ కార్యదర్శి.**



# వేసవి దుక్కులతో పంటల్లో తెగుళ్ల నివారణ

సి.యమున, శాస్త్రవేత్త,
ఎన్. ప్రవీణ్, ప్రిన్సిపాల్, శాస్త్రవేత్త,
ఏరువాక కేంద్రం, తాండూరు

వివిధ పైర్లను నాటింది మొదలు దిగుబడులు చేతికందే వరకూ పురుగులు, తెగుళ్లు పంటలను ఆశించి అడుగడుగునా నష్టాన్ని కలిగిస్తాయి. వీటికి అడ్డుకట్ట వేయకపోతే గుప్పెడు గింజలు కూడా మిగలని సందర్భాలు చూశాము. వివిధ పంటల్లో తెగుళ్ల నివారణకు వేసవిలో చేపట్టాల్సిన పనులు

**వేసవి దుక్కులు :** రైతులందరూ ఖరీఫ్, రబీ, వేసవి పంటలు కోత అనంతరం మళ్లీ ఖరీఫ్ సీజన్ ప్రారంభమై వర్షాలు మొదలయ్యే వరకూ భూమిని దున్నకుండా వదిలేస్తారు. తెగుళ్లు మొక్కలకు నేల, గాలి, నీరు, విత్తనాల ద్వారా వ్యాప్తి చెందుతాయి. నేల ద్వారా వ్యాప్తి చెందే తెగుళ్ల నివారణకు చేపట్టాల్సిన చర్యలకు వేసవికాలం చాలా అనువైనది. పత్తిలో వేరుకుళ్లు తెగులు, ఫ్యూజేరియం, వర్టిసిలియా వడలు తెగులు, పసుపులో వేరు దుంప తెగులు, మొక్కజొన్నలో ఎండు తెగులు, శనగ, వేరుశనగల్లో వడలు తెగులు నేల ద్వారా వ్యాప్తి చెంది పంటకు నష్టాన్ని కలిగిస్తాయి. ఈ తెగుళ్లను కలుగజేసే శిలీంద్రాలు వేసవిలో సిద్ధ బీజాల రూపంలో నేలలో ఉంటాయి. వేసవిలో లోతు దుక్కులు చేయడం వల్ల ఈ శిలీంద్రాల సిద్ధ బీజాలు ఎండకు చనిపోతాయి. అందువల్ల రాబోయే కాలంలో నేల ద్వారా వ్యాప్తి చెందే తెగుళ్ల వుధృతి తగ్గుతుంది. అంతే కాకుండా లోతు దుక్కుల వల్ల నేల నీటి సామర్థ్యం పెరగడమేగాక కోశస్థ దశలో ఉన్న పురుగులు చనిపోయి రానున్న పంట కాలంలో పురుగుల ఉధృతి కూడా తగ్గుతుంది.

**ఆవాస మెక్కల నిర్మూలన :** పంటల కోత అనంతరం తెగుళ్లను కలుగజేసే శిలీంద్రాలు, బ్యాక్టీరియా, వైరస్‌లు పొలంలో, గట్లమీద ఉన్న గడ్డి, ఇతర జాతి మొక్కల మీద ఆవాసం ఏర్పరుచుకొని కాలం గడుపుతాయి. వరిని ఆశించి అగ్గి తెగులు, బ్యాక్టీరియా ఎండాకు తెగులును కలగజేసే శిలీంద్రం, బ్యాక్టీరియా వరి కోత తర్వాత గట్ల మీద పెరిగే గడ్డి జాతి మొక్కలైన సైపరస్ రోంటడస్, తర్షియ హెక్షాంద్రా మీద ఆవాసం ఏర్పాటుచేసుకొని ఉంటాయి. కనుక వేసవి కాలంలో పొలం, గట్ల మీద ఉన్న గడ్డి జాతి మొక్కలను కచ్చితంగా నిర్మూలించాలి. దీని వల్ల శిలీంద్రాలు, బ్యాక్టీరియా సాంద్రత తగ్గి తద్వారా తెగుళ్ల ఉధృతి తగ్గుతుంది.

**స్వచ్ఛంద మొక్కలు, పంట అవశేషాల నిర్మూలన :** పంట కోతలు ఆలస్యమైనప్పుడు గింజలు పొలమంతా రాలిపోతాయి. కల్లం చుట్టుపక్కల కూడా గింజలు పడతాయి. అకాల వర్షాల కారణంగానో, లేదా ముందుగా కురిసే పరుపవనాల వల్లనోఈ గింజలు స్వచ్ఛందంగా మొలకెత్తి రోగకారకాలకు ఆవాసాన్ని కలిగిస్తాయి. ఈ విధంగా వృద్ధి చెందిన రోగ కారకాలు పంటను ఆదిలోను ఆశించి అధిక నష్టాలను కలుగజేస్తాయి. స్వచ్ఛందంగా పెరిగిన వరి మొక్క మీద వృద్ధి చెందిన అగ్గి తెగులు శిలీంద్రం వరి పంటను నారుమడి దశలో లేదా నాటిన తరువాత ఆశించి అధిక నష్టాన్ని కలుగుజేస్తుంది. వరి పంటను మెడ విరుపు తెగులు ఆశిస్తే ఈ శిలీంద్రం వరి మొక్క మెడ దగ్గర వుంటుంది. పంట కోత అనంతరం వరి గడ్డిని పొలం నుంచి తీసివేయకపోతే ఈ శిలీంద్రం పొలంలో ఉండి నారు లేదా నాటు వేశాక వెంటనే మొక్కకు సోకి నష్టాన్ని కలుగజేస్తుంది.

**విత్తన ఎంపిక :** వ్యవసాయంలో విత్తన ఎంపిక చాలా ముఖ్యమైన ప్రక్రియ. చాలా రకాల తెగుళ్లు విత్తనాల ద్వారా వ్యాప్తి చెందుతాయి. వరిలో గోధమ రంగు ఆకుమచ్చ తెగులు, సోయా చిక్కుడులో పక్షికన్ను తెగులు ద్వారా వ్యాప్తి చెందుతాయి. కనుక రైతు సోదరులు నాణ్యమైన, మేలైన, రోగా కారకాలులేని, తెగుళ్లను తట్టుకునే రకాలను ఎన్నుకొని నమ్మకమైన విత్తన విక్రయ సంస్థల ద్వారా మాత్రమే కొనుగోలు చేయాలి.

# పూసా ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్


**సభావత్ రాజు నాయక్**, పి. హెచ్.డి. వ్యవసాయ విభాగం,
**మోటపలుకుల జ్యోతి**, పి. హెచ్.డి. ఉద్యాన విభాగం,
**డాక్టర్. సంగీత చోప్రా**, ప్రధాన శాస్త్రవేత్త అగ్రికల్చరల్ ఇంజనీరింగ్ విభాగం
**డాక్టర్. హరిత బొల్లినేని**, శాస్త్రవేత్త, జన్యు శాస్త్ర విభాగం
వసంత్రావ్ నాయక్ మరత్వాడ వ్యవసాయ విశ్వవిద్యాలయం,
పర్భాని, మహారాష్ట్ర, ఐ.ఎ.ఆర్.ఐ. న్యూ ఢిల్లీ.





పూస ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్ వద్ద సంగీత చోప్రా, ప్రధాన శాస్త్రవేత్త




పూస ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్ లో భద్రపరచిన ఆకుకూరాలు, కూరగాయలు

రోజువారీ ఆహారంలో కాయగూరలు, ఆకుకూరలు, పండ్లకు ఎంతో ప్రాధాన్యత ఉంది. పంట పండించడం ఒక ఎత్తయితే చేతికొచ్చిన పంటను మార్కెట్లో అమ్ముకోవడం మరో ఎత్తు. వీటిలో నీరు శాతం అధికంగా ఉండడంతో చాలా తొందరగా పాడయిపోతాయి. ఎక్కువ రోజులు తాజాదనంతో ఉండనందువల్ల మార్కెట్‌లో తక్కువ ధరకే అమ్ముకోవడం లేదా మొత్తంగా పారవేయడం జరుగుతున్నది. సరైన మద్దతు ధర కోసం వేచి చూసే వ్యవధి రైతు దగ్గర లేకపోవడం చేత కూడా నష్టపోతూ ఉంటారు.

దేశంలోని మొత్తం ఉత్పత్తిలో 30 నుంచి 40 శాతం కూరగాయలు, పండ్లు వృధా కాగా, మొత్తం ఉత్పత్తిలో 10 శాతం దెబ్బతింటున్నాయి. ఈ విధంగా వృధా అయ్యే కూరగాయలు, పండ్లు ఒక వేళ సక్రమంగా భద్ర పరచగలిగితే ఆదాయాన్ని, రెట్టింపు చేసే లక్ష్యాన్ని రైతు సాధించడం సులభతరం అవుతుంది. దీనికి అనుగుణంగా కూరగాయలు, పండ్లు ఎక్కువకాలం నిల్వ చేసుకోవడానికి దోహదపడే "పూసా ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్"ను పూస సంస్థ ఐ.ఎ.ఆర్.ఐ. శాస్త్రవేత్తలు ఆవిష్కరించారు.

మిచిగాన్ స్టేట్ యూనివర్సిటీ సహకారంతో డాక్టర్ సంగీత చోప్రా, వారి బృందం కృషి వల్ల "పూస ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్" రూపొందించబడింది.

## పూసా ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్ ప్రత్యేకతలు

ఇది పూర్తిగా 100 శాతం సౌర శక్తి ఆధారంగా పనిచేస్తుంది. ఎటువంటి బ్యాటరీ కానీ ఎలక్ట్రిసిటీ గ్రిడ్స్ కానీ అవసరం లేదు. రైతులు తమ పొలంలోనే ఏర్పాటు చేసుకునే విధంగా రూపొందించడం వల్ల, కూరగాయలు లేదా పండ్లను కోసిన వెంటనే ఒక వారం నుంచి 12 రోజుల వరకు రైతులు తమ పొలంలోనే సులువుగా భద్రపరచుకోవచ్చు.

## పూసా ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్ ను నిర్మించడం ఎలా?

సోలార్ ప్యానెల్ కావాలి. దీని వల్ల సుమారు 5 కిలోవాట్ల సౌర శక్తి ఉత్పన్నమవుతుంది. ఈ సౌర శక్తిలోని కొంత భాగాన్ని వినియోగించుకుని గది లోపల అమర్చిన ఒకటిన్నర టన్నుల ఎయిర్ కండిషన్ పనిచేస్తుంది. మిగిలిన సౌరశక్తితో గది లోపల ఒక ప్లాస్టిక్ టబ్బులో ఏర్పాటు చేసిన నీటిని చల్లబరచడం జరుగుతుంది.

తరువాత ఆ చల్లటి నీటిని ఒక సబ్ మెర్సిబుల్ పంపు ద్వారా గది లోపలి భాగంలో పై భాగాన ఏర్పాటు చేసిన పైపుల ద్వారా సరఫరా చేస్తారు. ఎయిర్ కండిషన్డ్ చల్లటి నీళ్ల కారణంగా గది లోపలి ఉష్ణోగ్రత రోజంతా మూడు నుంచి ఐదు డిగ్రీల సెంటీగ్రేడ్‌లో ఉంటుంది. సూర్యాస్తమయం అయిన తర్వాత ఎయిర్ కండిషన్డ్, పైపులు వాటంతట అవే ఆగిపోతాయి. కానీ పైపులలో ప్రవహిస్తున్న

చల్లటి నీరు, గది లోపల ఏర్పాటు చేసిన ప్రత్యేకమైన సౌకర్యాల కారణంగా రాత్రి వేళలో కూడా గది లోపలి ఉష్ణోగ్రత ఎనిమిది నుంచి పది డిగ్రీల సెంటీగ్రేడ్‌లో ఉంటుంది.

పది అడుగుల పొడువు, పది అడుగుల వెడల్పు, పది అడుగుల ఎత్తులో ఏర్పాటు చేసిన గదిలో సుమారుగా రెండు టన్నుల వరకు రైతులు తమ ఉత్పత్తులను భద్రపరచుకోవచ్చు. దీనికి దాదాపుగా రూ.ఐదు లక్షల నుంచి రూ.ఐదున్నర లక్షల వరకు ఖర్చు అవుతుంది. కానీ ఒకసారి ఏర్పరుచుకున్నాక భవిష్యత్తులో ఎటువంటి నిర్వహణ ఖర్చులు ఉండవు. ఇద్దరు ముగ్గురు రైతులు ఒక సమూహంగా ఏర్పడి కూడా దీనిని ఏర్పాటు చేసుకోవచ్చు.

పూస ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్‌ను ఐ.ఎ.ఆర్.ఐ, న్యూఢిల్లీ క్యాంపస్‌తో పాటుగా పిహోలియా, రాజస్థాన్, చామరారా, హర్యానా గ్రామాల్లో ఏర్పాటు చేశారు. రైతులు ఈ పూసా ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్ ద్వారా కాయగూరలు, ఆకుకూరలు, పండ్లు తాజాదనాన్ని భద్రపరచుకుంటూ సరైన మద్దతు ధర లభించినప్పుడు మార్కెట్‌లో అమ్ముకుంటే అధిక లాభాలను పొందవచ్చు.

రైతులు వంకాయ, టొమాటో, బెండ, మిరప, పండ్లు, కట్ పువ్వులు మొదలైన పంటలను దఫాలుగా కోసి అమ్ముతారు. సోలార్ పవర్ సహాయంతో పొలంలో పూస ఫార్మ్ సన్ ఫ్రిడ్జ్‌ను నిర్మించుకుంటే ఎక్కువ మొత్తంలో పంటను చల్లటి నిర్మాణంలో భద్ర పరచుకునే వెసులుబాటు కలుగుతుంది. తద్వారా మంచి ధరకు అమ్ముకోవచ్చు. సమాచారం కోసం సంప్రదించవలసిన మొబైల్ నంబర్లు డాక్టర్ సంగీత

**చోప్రా : 011-25842294,**
**డాక్టర్ హరిత బొల్లినేని : 011-25841481,**
**సభావత్ రాజు నాయక్ : 7780765261,**
**మోటపలుకుల జ్యోతి : 9515800833.**

# పంట రుణ బాధ్యత పక్కదారి




- యాంత్రీకరణకు సహకార రుణాలు.
- ఆప్కాబ్, డిసిసిబిల నుండి వెయ్యి కోట్లు
- మిషన్లను అద్దెకివ్వనున్న గ్రూపులు

కేంద్ర ప్రాయోజిత పథకాల కింద రాష్ట్రంలో చేపట్టనున్న భారీ వ్యవసాయ యాంత్రీకరణకు సహకార సంస్థల నుండి భారీగా రుణాలివ్వాలని ఎపి ప్రభుత్వం నిర్ణయించింది. యాంత్రీకరణకు జాతీయ, ప్రైవేటు బ్యాంకులు ముందుకు రాకపోవడంతో తమ అజమాయిషీలోని ఆప్కాబ్, జిల్లా కేంద్ర సహకార బ్యాంకుల (డిసిసిబి) నుండి అప్పులు ఇప్పించేందుకు ప్రణాళిక వేసింది. ఈ ఆర్థిక సంవత్సరంలోనే మూడు దశల్లో మొత్తం 11,960 యూనిట్లకు రూ.వెయ్యి కోట్లకు పైన లోన్ మంజూరు చేయించనుంది. ఆర్థికంగా చితికిపోయి లావాదేవీలు నిర్వీర్యమై లైసెన్స్‌లు సైతం రద్దయ్యే స్థితిలో ఉన్న నాలుగు డిసిసిబిల నుండి సైతం యంత్రాలకు రుణాలిప్పించాలని ప్రతిపాదనలు సిద్ధం చేసింది. ఈ మధ్య ముఖ్యమంత్రి వద్ద యాంత్రీకరణపై జరిగిన సమీక్షా సమావేశంలో ఇచ్చిన డైరెక్షన్ మేరకు ఈ ప్లాన్‌ను వ్యవసాయశాఖ తయారు చేసి కింది స్థాయి అధికారులకు పంపింది.

### ప్రాజెక్టు విలువ 2,133 కోట్లు

మోడీ ప్రభుత్వం వ్యవసాయంలో భారీ యాంత్రీకరణకు ఎస్ఎంఎఎం, ఆర్‌కెవివై పథకాలను ఊపుమీద అమలు చేస్తోంది. ఎపిలో రెండేళ్లుగా ఆ స్కీంలను ప్రారంభించని వైసిపి సర్కారు, ఈ ఏడాది అమలు చేసేందుకు పక్కాగా షెడ్యూలు రూపొందించింది. రైతులకు యంత్రాలను అద్దెకిస్తారు. ప్రాజెక్టు విలువ రూ. 2,133 కోట్లు కాగా దానిలో రూ. 1,066 కోట్లు సహకార రుణం. రాష్ట్ర వ్యాప్తంగా గ్రామ గ్రామాన నెలకొల్పిన రైతు భరోసా కేంద్రాలు (ఆర్‌బికె) 10,750 ఉండగా, ఒక్కో ఆర్‌బికె పరిధిలో ఒక్కో కస్టమ్ హైరింగ్ సెంటర్ (సిహెచ్‌సి) నెలకొల్పుతుంది. ఒక్కో సిహెచ్‌సిలో ఒక మోస్తరు ముఖ్యమైన మిషన్ల కోసం రూ.15 లక్షలు యూనిట్ విలువగా పేర్కొని, దానిలో సగం (ఏడున్నర లక్షలు) సహకార బ్యాంకుల నుండి రుణం ఇప్పించాలనుకుంటోంది. అసెంబ్లీ నియోజకవర్గానికో హైటెక్ వాల్యూ హబ్ ఏర్పాటు చేసి భారీ యంత్రాలు అక్కడ పెట్టనుంది. ఒక్కో హబ్ యూనిట్ కాస్ట్ రూ.కోటిన్నర కాగా దానిలో సగం (75 లక్షలు) బ్యాంకుల నుండి లోన్ ఇప్పించనుంది. వరి అధికంగా పండే ఉభయ గోదావరి, కృష్ణా, నెల్లూరు జిల్లాల్లో, మండలానికి ఐదు చొప్పున, వరి కోత-నూర్పిడి యంత్రాలను కొనుగోలు చేయనుంది. ఒక్కో యంత్రం విలువ రూ.25 లక్షలుగా నిర్ణయించి దానిలో సగం (పన్నెండున్నర లక్షలు) బ్యాంక్ రుణంగా పేర్కొంది.

### ఎఫ్‌పిఓలకే..

మూడు దొంతర్లలో ఏర్పాటు చేసే కేంద్రాల నిర్వహణను గుర్తించిన రైతు గ్రూపులు, ఫార్మర్ ప్రొడ్యూసర్ ఆర్గనైజేషన్లు (ఎఫ్‌పిఒ), పిఎసిఎస్‌లకు ఇవ్వాలని ప్రతిపాదించినప్పటికీ అంతిమంగా ఎఫ్‌పిఓలు, కంపెనీ యాక్ట్ కింద రిజిస్టరైన రైతు గ్రూపులకు చెందనున్నాయని తెలుస్తోంది. యాభై శాతానికిపైగా పిఎసిఎస్‌లు నష్టాల్లో ఉన్నాయని ప్రభుత్వమే చెబుతోంది. రైతులకు ఎరువులు, విత్తనాలు సైతం అమ్మలేని స్థితిలోకి దిగజారాయి. రుణాలూ ఇవ్వట్లేదు. వాటికి యాంత్రీకరణను అప్పగించే అవకాశాలు చాలా తక్కువ. అనంతపురం, కర్నూలు, ఏలూరు, కడప నాలుగు డిసిసిబిల ఆర్థిక పరిస్థితి దారుణంగా ఉందని చెప్పిన ప్రభుత్వమే, వాటి నుండి యాంత్రీకరణకు రుణాలిప్పిస్తామంటోంది. ఈ చర్య వ్యవసాయ పంట రుణాల లక్ష్యాన్ని పక్కదారి పట్టించేలా ఉంది. ఆప్కాబ్ విషయమూ అంతే. ప్రస్తుత యాంత్రీకరణ వ్యవహారం గత టిడిపి ప్రభుత్వ హయాంలోని ట్రాక్టర్లు (రైతు రథం), ఇత్యాది పథకాలకు మల్లే, ఇప్పుడూ అధికారపార్టీ శ్రేణులకు అందివచ్చేలా ఉందన్న ఆరోపణలూ వినిపిస్తున్నాయి.



# మట్టి నమూనాల సేకరణ విధానం

## భూసార పరీక్షల ప్రాముఖ్యత - సూచనలు

డా.జి.ప్రసాద్ బాబు, శాస్త్రవేత్త (విస్తరణ విభాగం),
యం.జయలక్ష్మీ, శాస్త్రవేత్త (సస్య ఉత్పత్తి),
ఎన్.రమేశ్ నాయక్, శాస్త్రవేత్త (సస్య రక్షణ విభాగం)
డా.టి.శ్రీనివాస్, కార్యక్రమ సమన్వయకర్త.
ఆచార్య ఎన్. జి. రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం
కృషివిజ్ఞాన కేంద్రం, బనవాసి, కర్నూలు జిల్లా -518360

ఆరోగ్యకరమైన మానవుల జీవన శైలికి పంచ భూతములలో ఒకటైన భూమి ప్రముఖ పాత్ర వహిస్తుంది. పెరుగుతున్న జనాభా అవసరాలకు అనుగుణంగా ఆహారం ఇతరత్రా ఉత్పత్తి చేయడం కోసం రైతులు రసాయన వ్యవసాయం చేయడం వలన భూమి తన అస్థిత్వం కోల్పోయే పరిస్థితికి వచ్చినది.

మన పూర్వీకులు బాల్యంలో తిన్న ఆహారంతో పోల్చితే మనం 30శాతం మాత్రమే పోషక విలువలు ఉన్న ఆహారాన్ని తీసుకుంటున్నాం. ప్రపంచ జనాభాలో సుమారుగా 2 బిలియన్ల ప్రజలు సూక్ష్మధాతువుల లోపంతో బాధపడుతున్నారు. దీనిని బట్టి పంట భూములలో మొక్క పెరుగుదలకు ఆరోగ్యకరమైన వాతావరణము, సహజంగా ఉండే పోషక పదార్థాల శక్తి సామర్థ్యము తగ్గినట్లు తెలుస్తోంది. మానవుల ఆరోగ్యం భూమి ఆరోగ్యంపై ఆధారపడింది కనుక భూమి ఆరోగ్యం కాపాడుకోవడం తప్పనిసరి. భూసార పరీక్ష ఆధారంగా మెరుగైన యాజమాన్య పద్ధతులను చేపట్టి సమస్య ఉన్న భూములలో కూడా తక్కువ ఖర్చుతో అధిక లాభాలు పొందవచ్చు.

భూసార పరీక్షలు జరుపుకోవడానికి ఇది సరైన సమయం. పంట కోతలు అనంతరం రైతులు తమ పొలంలోని మట్టిని ప్రతి రెండు లేక మూడు సంవత్సరములకొకసారి పరీక్ష చేయించడం వలన పోషకాల హెచ్చు తగ్గులు గురించే కాక భూ భౌతిక, రసాయనిక సమస్యలు నేలల్లో విషతుల్యమైన పదార్థాల మోతాదుల గురించి కూడా తెలుసుకోగలుగుతారు.

**భూసార పరీక్ష అనే ప్రక్రియ ముఖ్యంగా 3 దశలుగా విభజింపబడినది. అవి**

1. మట్టి నమూనా సేకరణ
2. ప్రయోగశాలలో పరీక్షించటం
3. ఫలితాల ఆధారంగా ఎరువుల మోతాదు, సమస్యాత్మక భూములకు తగు సూచనలు చేయటం

### 1. మట్టి నమూనా సేకరణ :

పైన తెలుపబడిన మూడు శాస్త్రీయ పద్ధతిలో మట్టి నమూనాలన సేకరించడం ప్రధానమైనది. సేకరించిన మట్టి నమూనా పొలంలో సహజ లక్షణాలను ప్రతిభింబించే విధంగా ఉండాలి. సరియై నమూనాను సేకరించని పక్షంలో ఆ నమూనాపై జరిపిన పరీక్షలన వృధా కావటమే కాక విలువైన కాలాన్ని కూడా వృధా చేసినట్లవుతుంద కావున మట్టి నమూనా సేకరణలో శాస్త్రీయతను పాటించి త జాగ్రత్తలతో తప్పుడు సిఫారసులకు ఆస్కారం లేకుండా ఈ క్రిం వివరించిన విధంగా సేకరించాలి.

| జిగ్ జాగ్ ఆకారంలో మట్టి నమూనా సేకరణ | V ఆకారంలో 30 సెం.మీ. లోతులో మట్టి నమూనా సేకరణ | నాలుగు సమ భాగాలుగా విభజించడం | ఎదురెదురు భాగాలను తీసివేయడం |
|---|---|---|---|

మట్టి నమూనాలను సేకరించాల్సిన భూమిని ముందుగా నేల రంగు, ఎత్తు, వాలు, చౌడు, పంట దిగుబడులు మొదలగు అంశాలపై పరిశీలన చేసి కంటికి కనిపించే లక్షణాలను బట్టి వివిధ భాగాలుగా విభజించాలి. ప్రతి భాగం నుండి పొలం విస్తీర్ణాన్ని బట్టి నమూనాలను తీయాలి. కంటికి కనిపించే లక్షణాలలో ఎటువంటి తేడా లేనపుడు జిగ్ జాగ్ పద్ధతిలో పొలమంతా తిరుగుతూ ఒక ఎకరా భూమిలో కనీసం 8 నుండి 10 మట్టి నమూనాలను తీయాలి.

నమూనాలను తీయు స్థలంలో నేలపై ఉన్న ఆకులు, చెత్త చెదారం తీసి వేయాలి. తరువాత భూమిలో వి ఆకారంలో 15-30 సెం.మీ. లోతులో గుంత చేయాలి. 25 సెం.మీ. మందంతో ఒక అంచు నుండి భూమి పై భాగం నుండి క్రింది వరకు మట్టిని తీయాలి. ఇలా తీసిన మట్టిని శుభ్రమైన ప్లాస్టిక్ బకెట్లో గాని లేదా ప్లాస్టిక్ సంచులలో సేకరించాలి. భూ వైశాల్యాన్ని బట్టి పొలమంతా తిరుగుతూ సేకరించిన 8 నుండి 10 చిన్న మట్టి నమూనాలను ఒక శుభ్రమైన గుడ్డపై లేక పాలిథీన్ కాగితంపై వృత్తాకారంగా పరచి నాలుగు భాగాలు చేయాలి. ఎదురెదురుగా ఉన్న భాగాలను కలిపి మిగతా రెండు భాగాలను తీసివేయాలి. ఈ ప్రక్రియ 1/2 కిలో మట్టి వచ్చే వరకు కొనసాగించాలి. మిగిలిన 1/2 కిలో మట్టిని శుభ్రమైన గుడ్డ సంచిలో లేదా పాలిథీన్ సంచిలో నింపాలి. సేకరించిన మట్టి నమూనాకు సంబంధించిన క్రింది వివరాలను జతపరచి భూసార పరీక్ష కేంద్రంకు పంపాలి.

1. నమూనా క్రమ సంఖ్య
2. రైతు పేరు, చిరునామా
3. సేకరింపబడిన తేది
4. నమూనా ఎంత లోతులో సేకరింపబడినది
5. నేల ఆకృతి
6. నీరు ఇంకు గుణం
7. నేల వాలు
8. నేల కోత
9. గత సంవత్సరం పంట చరిత్ర
10. గత సంవత్సరంలో వేసిన ఎరువులు
11. నీటి సదుపాయం,
12. సాగు చేయదలచిన పంట వివరాలు

పంటను బట్టి మట్టి నమూనాలను సేకరించే లోతు మారుతుంది. వార్షిక పంట భూములలో 15-30 సెం.మీ. లోతు, పండ్ల తోటలలో అయితే ప్రతి 5 ఎకరాలకు ఒకటి చొప్పున 2×1×1 మీ.ల కొలత గల గుంట త్రవ్వి, నమూనాలను ప్రతి పొర నుండి సేకరించాలి. లేనిచో మొదటి 0-15, 15-30 సెం.మీ.లలో, తరువాత ప్రతి 30 సెం.మీ. లకు ఒక నమూనాను సేకరించాలి. దీనినే ప్రొఫైల్ శాంపిలింగ్ అంటారు.

### మట్టి నమూనాలను సేకరించుటలో తీసుకోవల్సిన జాగ్రత్తలు

- చెట్ల క్రింద, గట్ల ప్రక్కన, కంచెల దగ్గర, ఎరువుల కుప్పల దగ్గర, కాలి బాటలలో నమూనాలను తీయరాదు.
- బాగా సారవంతమైన చోట్ల, నిస్సారవంతమైన చోట్ల కలిపి తీయరాదు.
- చౌడు భూములలో నమూనాలను విడిగా తీయాలి. సాధారణ భూముల మట్టితో కలిపి తీయరాదు.

ప్యాకింగ్ చేయడం

ప్రయోగ శాలలో పరీక్షలు

- ఎరువులు వేసిన 45 రోజుల లోపు నమూనాలను తీయరాదు.
- నమూనా తీసేటప్పుడు నేలపై ఉన్న గడ్డి, చెత్త, ఆకులు తీసివేసి శుభ్రం చేయాలి.
- సాధారణంగా నీరు నిలిచి బురదగా ఉన్న నేలల నుండి నమూనాలను తీయరాదు. తప్పనిసరిగా తీయవలసి వచ్చినచో నీడన ఆరబెట్టి పరీక్షకు పంపాలి.
- మెట్ట, ఆరుతడి సేద్యంలో పైరు పెరుగుతున్న సమయంలో నమూనా తీయవలసినపుడు వరుసల మధ్య నుండి నమూనాను సేకరించాలి.
- చౌడు భూములలో 0-15 సెం.మీ., 15-30 సెం.మీ. లోతులో 2 నమూనాలను సేకరించాలి.

### 2. ప్రయోగశాలలో పరీక్షలు :

రైతులు సేకరించి పంపిన నమూనాలపై ప్రయోగశాలలో పరీక్షలు జరుపుతారు. భౌతిక ధర్మాలైనటువంటి నేల రంగు, ఆకృతి, పోషక నిల్వ సామర్థ్యము లక్షణాలే కాక ఉదజని సూచిక, లవణ పరిమాణం, సేంద్రీయ కర్బనం, లభ్య నత్రజని, భాస్వరం, పొటాషియం సూక్ష్మ పోషకాల స్థాయి ఎలా ఉన్నదో నిర్ధారించి భూసార పరీక్షా పత్రాలలో పొందు పరుస్తారు.

### ఫలితాలు ఆధారంగా ఎరువుల సిఫారసులు, సమస్యాత్మక నేలలకు తగు సూచనలు

భూమిలో ఉన్న వివిధ పోషకాల స్థాయిని బట్టి పంటను బట్టి ఎరువుల మోతాదులను అలాగే ఏవైనా సమస్యను కనుక గ్రహించినట్లయితే సున్నం, జిప్సం లాంటివి కూడా సమస్య తీవ్రతను బట్టి సూచించడం జరుగుతుంది. కావున రైతులు తప్పనిసరిగా భూసార పత్రం లేదా భూ ఆరోగ్య పత్రంలో పొందుపరచిన వివిధ అంశాల గురించి తప్పనిసరిగా అర్ధం చేసుకొని ఆచరించాలి.

### భూసార పరిజ్ఞానం ద్వారా కొన్ని సూచనలు

వ్యవసాయ విశ్వవిద్యాలయం వారు పంటను బట్టి, నేలను బట్టి వివిధ పరిశోధనా స్థానాలలో జరిపిన పరిశోధనా ఫలితాల ఆధారంగా, వివిధ పంటలకు వేయవలసిన ఎరువుల మోతాదును నేల స్వభావాన్ని బట్టి ప్రాంతాల వారీగా నిర్ధారిస్తారు. భూమిలో పోషకాల స్థాయి మధ్యస్థంగా ఉంటే సిఫారసు చేసిన మోతాదు వరకు ఎరువులను వాడాలి. అలా కాక పోషక స్థాయి తక్కువ గాని, ఎక్కువ గాని ఉంటే సిఫారసు చేసిన మోతాదులను తక్కువ, ఎక్కువగా మార్చుకోవాలి. తక్కువగా ఉన్నపుడు సిఫారసు చేసిన మోతాదు కంటే 30 శాతం ఎక్కువగాను, ఎక్కువగా ఉన్నపుడు ఈ మోతాదును 30 శాతానికి తగ్గించి వేయటం వలన సాధారణ దిగుబడులు సాధించవచ్చు.

సిఫారసు చేసిన ప్రకారం మార్కెట్లో లభిస్తున్న ఎరువులలో పోషక శాతాన్ని, పొలం విస్తీర్ణాన్ని పరిగణనలోనికి తీసుకొని ఎరువులను లెక్కగట్టి వేయడం వల్ల ఎరువుల పైన అనవసర వ్యయాన్ని అధిగమించవచ్చును, తద్వారా అధిక దిగుబడులను పొందవచ్చును. సిఫారసు చేసిన మోతాదులో కొంత భాగాన్ని సేంద్రియ ఎరువుల ద్వారా అందించి మిగిలిన మోతాదును రసాయనిక ఎరువుల ద్వారా వేయటం వలన రసాయనిక ఎరువుల వినియోగాన్ని తగ్గించవచ్చును.

లభ్య భాస్వరం ఎక్కువ స్థాయిలో ఉన్నట్లయితే, సిఫారసు చేసిన మోతాదును 30 శాతం తగ్గించి వాడాలి. అంతే కాక భాస్వరం కరిగించే సూక్ష్మజీవుల వాడకం, సేంద్రీయ ఎరువులు వాడినట్లయితే భూమిలోని భూసారం కరిగి, పైరుకి అందుబాటులోకి వస్తుంది. రెండోసారి లేక మూడోసారి పైపాటుగా భాస్వరం కలిగిన కాంప్లెక్సు ఎరువులు వాడకూడదు. భాస్వరం అధికంగా వాడినపుడు జింక్, ఐరన్, మాంగనీసు వంటి సూక్ష్మ పోషకాల లభ్యత తగ్గుతుంది.

పంట వేయబోయే ముందు నేల ఆరోగ్యం భూసార పరీక్ష పత్రం ద్వారా తెలుసుకుంటే తగిన రీతిలో కావలసిన పోషక పదార్థాలను తగిన సమయంలో నేలకు అందించవచ్చు. తక్కువ పెట్టుబడితో సమగ్ర ఎరువులు సమపాళ్ళల్లో వాడి శాశ్వత భూసార సంరక్షణ, అధిక దిగుబడులు సాధించవచ్చును. కనుక భూసార పరీక్షా పత్రము ద్వారా వ్యవసాయంలో ఎరువుల వాడకాన్ని శాస్త్రీయ సాంకేతిక పరిజ్ఞానాన్ని జోడించి, యాజమాన్య మెలకువలను పాటించడం శ్రేయస్కరం.



ఉదజని సూచిక




లవణ పరిమాణ సూచిక



# పచ్చిరొట్ట ఎరువుల ప్రాముఖ్యత

ఎన్. నాగేంద్ర బాబు, శాస్త్రవేత్త (విస్తరణ),
ఏరువాక కేంద్రం, పెద్దాపురం. (9494133633)

నేలకు స్వతహాగా పోషకాలను అందించే శక్తి ఉన్నా; కొన్ని సంవత్సరాలుగా రసాయనిక ఎరువులతో నేలను సాగు చేయటం వలన వాటి కొరత ఏర్పడింది. కావున భూసారాన్ని పెంపొందించు కోవడానికి ఇప్పుడున్న పరిస్థితుల్లో పచ్చిరొట్ట పైర్ల సాగు రైతు సోదరులకు ఆర్థికంగా లాభదాయకంగా ఉంటుంది. పచ్చిరొట్ట పైర్లను భూసార నిర్మాణ పంటలు అని కూడ అనవచ్చు. పచ్చిరొట్ట ఎరువులను అందించడం ద్వారా నేలలో ఉండే సూక్ష్మజీవులకు ఆహారం, అవి వృద్ధి చెందడానికి వాతావరణాన్ని కల్పిస్తాయి. ఈ సూక్ష్మజీవులు పచ్చిరొట్ట ఎరువులోని పోషకాలను లభ్యమయ్యే స్థితిలోకి మార్చి పంటలకు అందజేస్తాయి. నేలలో సంబంధమైన చర్యలను మెరుగుపరచడం ద్వారా నేల భౌతిక, రసాయన పరిస్థితులు కూడా మెరుగుపడతాయి. మాగాణి భూముల్లో వేసవి కాలంలో పచ్చిరొట్ట పైర్లను సాగుచేసుకోడానికి అనువైన సమయం.

**పచ్చి రొట్ట పైర్లతో కలిగే లాభాలు**

- భూసారం పెరుగుతుంది.
- నేలలోని సేంద్రీయ పదార్థం వృద్ధి చెందడం ద్వారా పొలానికి నీటిని, పోషక పదార్థాలను నిల్వ ఉంచుకునే శక్తి పెరిగి పోషకాల వృధాను అరికడతాయి.
- భూమి భౌతిక స్థితి మెరుగుపడుతుంది, నేలను గుల్లబారేలా చేసి గాలి ప్రసరణ మెరుగుపడుతుంది.
- మమురుగునీటి వ్యవస్థ మెరుగవుతుంది.
- మొక్కలకు సూక్ష్మ పోషక లోపాలు రావు.
- నేలను కోతకు గురికాకుండా కాపడుతుంది.
- పంట నాణ్యత పెరుగుతుంది.
- పంటకు చీడ పీడలను తట్టుకునే శక్తి పెరుగుతుంది.
- సారవంతమైన నేలలను పాలచౌడు, కారుచౌడు నేలలుగా మారకుండా నివారిస్తుంది.
- తదుపరి పంటకు సులభంగా పోషకాలను అందించడం వలన పంట దిగుబడి 15 నుండి 20 శాతం అధికంగా పెరుగుతుంది.

**పచ్చి రొట్ట పైర్ల రకాలు**

పచ్చి రొట్ట ఎరువులను రెండు రకాలుగా పైర్లకు అందించవచ్చు. పచ్చి రొట్ట ఎరువు, పచ్చి ఆకు ఎరువుగా నేలకు అందించవచ్చు.

**1. పచ్చి రొట్ట ఎరువు :** ఎరువు కోసం ఒక పైరును ప్రత్యేకంగా సాగు చేసి పూత వచ్చే దశలో భూమిలో కలియదున్ని తగినంత నీరు పెట్టి కుళ్ళనివ్వాలి. తర్వాత పండించే పంట వేసే సమయానికి పచ్చి రొట్ట పైరు బాగా కుళ్ళి ఎరువుగా మారుతుంది. పుష్పజాతి పైర్లు పచ్చిరొట్టకు బాగా పనికివస్తాయి.

**ఉదా :** పిల్లిపెసర, జీలుగ, అలసందలు, జనుము మొదలగునవి.

**2. పచ్చిఆకు ఎరువు :** పచ్చి రొట్ట పంటను పండించడానికి అవకాశం లేనప్పుడు, లేదా ప్రధాన పంటలు వేయడానికి మధ్యలో వ్యవధి తక్కువగా ఉన్నప్పుడు పచ్చిరొట్ట పైరు ఆకులను సేకరించి పొలంలో వేసి కలియదున్ని తగినంత నీరు పెట్టి కుళ్ళనివ్వాలి.

**ఉదా :** జిల్లేడు, నేల తంగేడు, గానుగ, గ్లైరిసీడియా, సుబాబుల్ మొదలైన పచ్చి ఆకులను ఎరువుగా వాడవచ్చు.

**పచ్చి రొట్ట పైర్లకు ఉండవలసిన లక్షణాలు**

- పచ్చి రొట్ట పైర్లు త్వరత్వరగా పెరిగి ఆకులు ఎక్కువగా వచ్చి కాండం మెత్తగా ఉండాలి.
- ఇవి మృదువుగా ఉండి త్వరగా కుళ్ళే స్వభావం కలిగి ఉండాలి.
- అన్ని నేలలకు శీతోష్ణస్థితికి, నీటి ఎద్దడికి తట్టుకునేలా ఉండాలి.
- త్వరగా పెరిగి కలుపు మొక్కలను అరికట్టేవిగా ఉండాలి. వీలైనంత వరకు పప్పు జాతి మొక్కలైతే వేర్లపైన బొడిపెలలో ఉండే రైజోబియం అనే బ్యాక్టీరియా గాలిలోని నత్రజనిని స్థిరీకరిస్తాయి.
- చల్లే విత్తనం చౌకగానూ, మార్కెట్లో సులభంగా లభించేవిగా వుండాలి.

- చీడ పీడల బెడద ఉండకూడదు.
- పచ్చి రొట్ట పైర్ల వేర్లు భూమిలోకి చొచ్చుకునే గుణం కలిగి వుండాలి.

**పచ్చి రొట్ట పైర్లు - వాటి పోషకాలు :**

**జీలుగ :** దీనిని తేలిక పాటి నేలల్లో, ఇసుక నేలల్లో సాగుచేయవచ్చు. చౌడు భూములకు అనుకూలం. ఎకరానికి 12-15 కిలోల విత్తనం అవసరం. వీటి వేర్ల మీద నత్రజని నిల్వ చేసే బొడిపెలు ఎక్కువగా ఉంటాయి. 70-80 రోజుల్లో కలియదున్నాలి. సెస్బేనియా ఎక్యులేట , సెస్బేనియా రోస్ట్రేట అని రెండు జాతులు ఉన్నాయి. సెస్బేనియా రోస్ట్రేట అయితే 7 వారాల్లోనే ఒకటిన్నర మీటర్ల ఎత్తు పెరిగి మృదువైన ఆకులనిస్తుంది. సెస్బేనియా ఎక్యులేట హెక్టారుకి 32 టన్నుల పచ్చిరొట్టనిస్తుంది. టన్ను పచ్చిరొట్టలో సుమారు 5 కిలోల నత్రజని, 6 కిలో భాస్వరం, 12 కిలోల పొటాష్ ఉంటాయి.

**పిల్లి పెసర :** ఇది పచ్చిరొట్టగా, పశుగ్రాసంగా ఉపయోగపడుతుంది. నల్ల రేగడి నేలల్లో బాగా పెరుగుతుంది. నేలలో నీరు నిల్వ ఉన్నా, నీటి ఎద్దడి ఉన్నా తట్టుకోగలదు. మొదటి 4 వారాల్లో మొక్క త్వరగా పెరిగి తర్వాత నెమ్మదిగా పెరుగుతుంది. ఎకరానికి 5-6 కిలోల విత్తనం అవసరం, హెక్టారుకి 5-6 టన్నుల పచ్చిరొట్టనిస్తుంది.ఒక టన్ను పచ్చిరొట్టలో 7.2 కిలోల నత్రజని, 1 కిలో భాస్వరం, 1.2 కిలోల పొటాష్ ఉంటాయి.

**జనుము:** నీరు ఇంకిపోయే తేలికపాటి నేలల్లో పెరుగుతుంది. పచ్చిరొట్టగానూ, పశువులమేతగాను పనికొస్తుంది. ఎకరానికి 10-15 కిలోల విత్తనం అవసరం. పూత దశలో కలియదున్నాలి. దీనిని ఆకుపచ్చ బంగారం అంటారు. పైగ త్వరగా పెరిగి మృదువైన ఆకులనిస్తుంది. హెక్టారుకి సుమారు 20-25 టన్నుల పచ్చిరొట్టనిస్తుంది. ఒక టన్ను పచ్చిరొట్టలో 4 కిలోల నత్రజని, 5 కిలోల భాస్వరం, 18 కిలోల పొటాష్ ఉంటాయి.

**అలసంద :** పచ్చిరొట్ట ఎరువుగా, పశువులమేతగా వాడవచ్చు. ఎకరానికి 14-15 కిలోల విత్తనం అవసరం. నీటి ఎద్దడిని తట్టుకుంటుంది. పూత దశలో కోసినప్పుడు ఎకరానికి 4-6 టన్నుల పచ్చిరొట్ట లభిస్తుంది. ఒక టన్ను పచ్చిరొట్టలో 3-5 కిలోల నత్రజని ఉంటుంది.

**పెసర, మినుము :** ఎకరానికి 6-8 కిలోల విత్తనం అవసరం. నీరు నిల్వ ఉండే భూములు పనికిరావు. వరి కోసిన తర్వాత విత్తనాలు చల్లి కాయలు కోసిన తర్వాత మిగిలే రొట్టను కలియదున్నుతారు. పశుగ్రాసంగా కూడా ఉపయోగపడుతుంది. ఎకరానికి 3 టన్నుల పచ్చిరొట్ట లభిస్తుంది. 1 టన్ను పచ్చిరొట్టలో 3.5-4 కిలోల నత్రజని ఉంటుంది.

**పచ్చి రొట్ట ఎరువుల వాడకంలో జాగ్రత్తలు :**

పచ్చి రొట్ట పైర్లకు ఎక్కువ ఎరువులు వాడాల్సిన్న అవసరం లేదు. విత్తనాలు విత్తడం తో పాటు ఎకరానికి 16 -18 కిలోల భాస్వరాన్నిచ్చే సూపర్ ఫాస్ఫేట్ లాంటి రసాయన ఎరువు వేయాలి.

పూతదశలో కోసి పొలంలో కలియదున్నాలి. పూతదశలో పైరు ఏపుగా పెరిగి, ఆకులు, కొమ్మలు, కాండం మృదువుగా, లేతగా ఉంటాయి. కాబట్టి త్వరగా చివికి పోతాయి.

- గింజకు ఉపయోగపడే పిల్లిపెసర, అలసంద, పెసర, గోరుచిక్కుడు, వంటి పైర్లకు కాయలు కోసిన తర్వాత మిగిలిన రొట్టను నేలలో కలియదున్నవచ్చు. అలాంటప్పుడు పైరు కాలం 65 నుంచి 80 రోజుల వరకు ఉంటుంది.
- బోరాన్, మాలిబ్దినం, సూక్ష్మ పోషకాలు మొక్కల వేర్ల మీద ఉండే బొడిపెలు పెరగడానికి ఉపయోగపడి నత్రజని స్థిరీకరణకు ఉపయోగపడతాయి. కనుక పుష్పజాతి పైర్లు పండించే పొలంలో ఈ రెండు పోషకాలను మొక్కలకు వేయాలి.
- పచ్చి రొట్ట పైర్లను కలియదున్నిన తర్వాత బాగా నీరు పెట్టి. 2-3 వారాల పాటు మురగనివ్వాలి. పచ్చిరొట్ట కుళ్ళే సమయంలో కొన్ని హానికరమైన ఆమ్లాలు తయారవుతాయి. కనుక 2-3 వారాల్లో పచ్చిరొట్ట కుళ్ళిపోయాకా పొలంలో మురుగునీరు తీసివేసి కొత్తనీరు పెట్టి ఆ తర్వాత పైరును నాటుకోవాలి. కాబట్టి పచ్చిరొట్ట ఎరువులతో భూసారాన్ని పెంచి రసాయన ఎరువులను మూడోవంతుకు తగ్గించుకొని మంచి దిగుబడులను సాధించవచ్చు.





# న్యూట్రి గార్డెన్/ పోషకాల పెరటితోట పెంచే విధానం


డా.జి.ప్రసాద్ బాబు, శాస్త్రవేత్త (విస్తరణ విభాగం)
అపర్ణ, శాస్త్రవేత్త (గృహవిజ్ఞానం),
యం.జయలక్ష్మీ, శాస్త్రవేత్త (సస్య ఉత్పత్తి),
ఎన్.రమేశ్ నాయక్, శాస్త్రవేత్త (సస్య రక్షణ విభాగం)
డా.టి.శ్రీనివాస్, కార్యక్రమ సమన్వయకర్త.
ఆచార్య ఎన్. జి. రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం
కృషివిజ్ఞాన కేంద్రం, బనవాసి, కర్నూలు జిల్లా -518360


**కిచెన్ గార్డెన్ అంటే ఏమిటి?**

పెరటిలో పెంచుకునే చెట్లలో ఇవి అవి అని తేడా లేకుండా అన్ని రకాల కూరగాయలు, ఆకుకూరలు, పండ్లు పెంచుకుంటాం. దానినే కిచెన్ గార్డెన్ అంటాం.

**న్యూట్రి గార్డెన్ అంటే ఏమిటి?**

పెరటిలో పెంచుకునే చెట్లలో ఐరన్, ఫోలిక్ ఆసిడ్, కాల్షియం, విటమిన్ ఏ, విటమిన్ సి ఎక్కువగా లభించే ఆకుకూరలు/ కూరగాయలు/పళ్ళు చెట్లను పెంచటాన్నే న్యూట్రి గార్డెన్ అంటున్నాము.

**న్యూట్రి గార్డెన్ ఎవరు వేసుకోవాలి?**

సంఘ సభ్యులందరూ, ముఖ్యంగా 1000 రోజుల పరిధిలో వున్న కుటుంబాలు, అతి నిరుపేద కుటుంబాలు న్యూట్రి గార్డెన్ పెంచుకుని ఉపయోగించుకోవాలి.

**న్యూట్రి గార్డెన్ ఎందుకు వేసుకోవాలి?**

- శరీరానికి అత్యవసరమైన విటమిన్లు, ఖనిజాలు, సూక్ష్మపోషకాలు, పీచువంటి వాటికి ఆకు/కూరగాయలు, పండ్లే ఆధారం.
- ప్రతి మనిషి సగటున 50 గ్రాముల ఆకుకూరలు, 50 గ్రా. దుంపకూరలు, 200 గ్రా ఇతర కూరగాయలు తినాలి.
- గర్భిణీలు, బాలింతలు అయితే మరో 50 గ్రా. ఆకుకూరలు అదనంగా తినాలి.
- చాల సర్వేలలో తేలింది ఏమిటంటే గ్రామీణ ప్రాంతాలలో చాలా మంది తినవలసిన ఆకు/కూరగాయలలో నాల్గవవంతు కూడా తినటంలేదు.
- ధాన్యాలు, పప్పులు తినటం కొంతవరకూ ఫరవాలేదు కాని ఆకు/ కూరగాయలు, పండ్లు చాలా చాలా తక్కువగా తినటం వలన చాలామంది రక్తహీనతకు, పోషకాహారలోపానికి గురిఅవుతున్నారు.
- రక్తహీనత నివారించటానికి ఐరన్ ఎక్కువగా లభించే ఆకు/ కూరగాయలు, తిన్న ఆహారంలోని ఐరన్ వంటికి పట్టటానికి , వ్యాధులు రాకుండా నివారించటానికి, వ్యాధినిరోధక శక్తిని పెంపొందించటానికి/ బలోపేతం చేయటానికి, ఆరోగ్యంగా ఉండటానికి విటమిన్ "ఏ","సి" లు ఎక్కువగా లభించే పండ్లు, కూరగాయలను తినాలి.
- ఆకు/కూరగాయలను తినటం వలన పోషకాహార లోపాన్ని నివారించటమేకాక జీవనశైలికి సంబంధించిన మధుమేహం, రక్తపోటును కూడా నివారించవచ్చు.
- అనారోగ్యాలను దూరంగా ఉంచగలిగే, తక్కువ ఖర్చుతో ఇంటి దగ్గరే పండించుకుని తినగలిగే ఆకు/ కూరగాయలు, పండ్ల మొక్కలను ఉన్న కొద్దిపాటి స్థలంలోనే పండించుకోవాలి.
- పురుగుమందులు ఎక్కువగా వాడుతూ, కలుషితనీటితో పండిస్తున్న కూరగాయలు/ఆకుకూరల వినియోగాన్ని తగ్గించుకోవటానికి,




సమతుల ఆహారం తినటానికి, పెరుగుతున్న కూరగాయల ఖర్చు తగ్గించుకోవటానికి, మానసిక ఉల్లాసం కలిగించే వ్యాపకంగాను ఇంటి దగ్గరే కూరగాయలను పండించుకుని తినాలి.

ఇవి పండించుకుని తింటూ అదనంగా ఉన్న స్థలాన్నిబట్టి, అభిరుచినిబట్టి వేరే కూరగాయలను కూడా వేసుకోవచ్చు.

**న్యూట్రి గార్డెన్ లో ఏమేమి వేసుకోవాలి? అవి తినటం వలన ఉపయోగాలు ఏమిటి? తినకపోతే వచ్చే నష్టం ఏమిటి?**

ఐరన్, ఫోలిక్ ఆసిడ్, కాల్షియం, విటమిన్ "ఎ", విటమిన్ "సి" ఎక్కువగా లభించే ఆకుకూరలు/కూరగాయలు/పళ్ళు చెట్లను వేసుకోవాలి.

**ఐరన్ - ఫోలిక్ ఆసిడ్ తినటం వలన ఉపయోగాలు :**

స్త్రీలు, గర్భిణీలు, బాలింతలు, పిల్లలలో రక్తహీనత నివారణకు, పిల్లలలో పుట్టుకతో వచ్చే నాడీ సంబంధ లోపాలు/అవకరాలు రాకుండా ఉండేందుకు, బిడ్డ సరి అ యిన బరువుతో పుట్టటానికి ఉపయోగపడతాయి.

**తినకపోతే వచ్చే నష్టం:**

- స్త్రీలు, గర్భిణీలు, బాలింతలు, పిల్లలలో రక్తహీనత కలగవచ్చు
- పిల్లలలో పుట్టుకతో వచ్చే నాడీ సంబంధ లోపాలు/అవకరాలు రావచ్చు
- బిడ్డ సరిఅయిన బరువుతో పుట్టకపోవచ్చు

**ఎక్కువగా లభించే ఆకుకూరలు/కూరగాయలు/పళ్ళు:**

ఆకుపచ్చని ఆకుకూరలు (కాలీఫ్లవరు ఆకులు, క్యారెట్టు ఆకులు, తమలపాకు, చామ, పొదీన, తోటకూర, పాలకూర, చుక్కకూర, కరివేపాకు), పప్పులు, ఎండు పప్పులు, గోరుచిక్కుడు, బెండ, టమాట, దోస మరియు ఆయా కాలా లలో దొరికే పుచ్చకాయ, సీతాఫలం మొదలగు వాటిలో ఐరన్ మరియు ఫోలిక్ ఆసిడ్ ఎక్కువగా లభిస్తాయి.

**విటమిన్ "ఎ"**

**తినటం వలన ఉపయోగాలు :**

కంటిచూపుకి, వ్యాధినిరోధకశక్తి పెంచటానికి, రక్తనాళాల లోపలిగోడలు మరియు అవయవాల పై పొరలు ఆరోగ్యంగా ఉండటానికి కీలకం.

**తినకపోతే వచ్చే నష్టం :**

విటమిన్"ఎ" లోపిస్తే రకరకాల ఇన్ఫెక్షన్లు వేధిస్తాయి

**ఎక్కువగా లభించే ఆకుకూరలు/కూరగాయలు/పళ్ళు :**

ముదురు ఆకుపచ్చ, పసుపు, నారింజ రంగుల్లో ఉండే ఆకు/కూరగాయలు, పండ్లు ఉదా: చామ ఆకులు, కరివేపాకు, ఎర్ర బచ్చలి, కొత్తిమీర, ములగ, ముల్లంగి - క్యారెట్లు ఆకులు, తమలపాకులు, పాలకూర, క్యారెట్లు, మామిడిపండు, కమల, గుమ్మడి, ములగ, చిలకడ దుంపలు, బొప్పాయి, పుచ్చ మొదలగువాటిలో విటమిన్"ఎ" సమృద్ధిగా లభిస్తుంది.

**విటమిన్ "సి":**

**తినటం వలన ఉపయోగాలు :**

శాఖాహారం ద్వారా లభించే ఐరన్‌ను శరీరం గ్రహించటానికి విటమిన్"సి" అత్యవసరం.

**తినకపోతే వచ్చే నష్టం :**

అలసటగా ఉండటం, పంటి చిగుర్లలో రక్తం కారటం, ఎముకల పెరుగుదలలో లోపం వంటివి విటమిన్ "సి" లోపం వలన కలగవచ్చు.

**ఎక్కువగా లభించే ఆకుకూరలు/కూరగాయలు/పళ్ళు :**

విటమిన్"సి లోపం రాకుండా ఉండేందుకు ఇది ఎక్కువగా లభించే ఆకు/కూర గాయాలు, పండ్లను తాజాగా తినాలి. ఉదా: ములగ ఆకులు, ములగ కాడలు, కొత్తిమీర, క్యాబేజి, పుల్లటి పండ్లు (ఉదా: ఉసిరి, నిమ్మ, నారింజ), జామ, పచ్చిమిర్చి, అలాగే మొలకెత్తిన పెసలలో విటమిన్"సి" చాల ఎక్కువగా ఉంటుంది.

అంతేకాక తిన్నఆహారం నిదానంగా జీర్ణంఅయ్యేలా చేసే పీచు, ఎముక క్షీణత తగ్గటానికి ఉపయోగపడే పొటాసియం, ఇతర బి కాంప్లెక్స్ విటమిన్లు కూడా మనకు ఆకు/కూరగాయలు, పండ్లలో లభిస్తాయి.

- అందువలన ఐరన్, విటమిన్ "ఎ" "సి" లు ఎక్కువగా లభించే ఆకు/కూరగాయలు పండ్లు తప్పనిసరిగా పెరటి తోటలలో పెంచుకుని తినటం వలన పోషకాహార లోపానికి రక్తహీనతకు గురికాకుండా ఉపయోగపడతాయి. మంచి ఆరోగ్యానికి బాటలు వేసుకున్నట్లు అవుతుంది. ఇవే కాక ఆయా కాలాలలో దొరికే పండ్లు తినటం మంచిది.

**న్యూట్రి గార్డెన్ అంటే కనీసం ఎన్ని రకాలు ఉండాలి?**

- కనీసం 5 రకాల ( కూరగాయలు/ఆకుకూరలు/పండ్లు ) ఉంటేనే దానిని న్యూట్రి గార్డెన్ అంటాము.

**న్యూట్రి గార్డెన్ అమలుకు చేయవలసినవి:**

**స్థల ఎంపిక మరియు లేఔట్ :**

- పెరటిలో ఉన్న కొద్దిపాటి స్థలంలో పండించుకునేవి కుటుబ సభ్యుల ఆరోగ్యాన్ని పెంపొందించేవి, సీజన్‌కు అనుకూలంగాను, కుటుంబసభ్యుల అభిరుచిని బట్టి ఎంపిక చేసుకోవాలి.
- నీటి వసతి దగ్గరగా మరియు సరిపడినంత సూర్యరశ్మి (8-10 గంటలు) అందే చోట ఏర్పాటు చేయాలి.
- వేప, కానుగ, సీతాఫలం, ఆముదం గింజల పిండిని తగుమాత్రంగా మట్టిలో కలపటం ద్వారా చీడ పీడలను నివారించవచ్చు.

కొబ్బరిపొట్టు లేదా రంపపు పొట్టు మట్టిలో కలపటం ద్వారా నీటిని పట్టి ఉంచుతుంది.

- బహువార్షిక మొక్కలైన మునగ, కరివేపాకు, జామ, ఉసిరి, బొప్పాయి మొదలైన వాటిని పెరటితోటలో ఒకవైపున (ఉత్తరం) నాటుకోవాలి. ఆ చెట్ల నీడ మొక్కల మీద పడకుండా ఉండే విధంగా వీటిని నాటుకోవాలి.
- పెరటి తోట చుట్టూ కంచె ఏర్పాటు చేసుకోవడం వలన పెరటితోటకు రక్షణగా ఉపయోగపడుతుంది.
- తీగజాతి కూరగాయలు /పండ్లను కంచెపైన పండించుకోవచ్చు.

**ఉదా : చిక్కుడు, పుచ్చ మొ... నవి.**

- బహువార్షిక మొక్కలకు స్థలం కేటాయించిన తరువాత మిగిలిన భాగాన్ని 6-10 సమభాగాలుగా చేసుకుని ఏకవార్షిక కూరగాయలను నాటుకోవాలి.
- కూరగాయలు బాగా పండుటకు తగినంత ఎరువులను (పశువుల ఎరువు, వర్మి కంపోస్ట్) వేయాలి.
- తాజా కూరగాయలను పొందుటకు పెరటి తోటలలో కలుపు లేకుండా, తెగుళ్ళు మరియు చీడలు లేకుండా పెంచుకోవాలి.

**ఎరువుల వినియోగం :**

- స్థలాన్ని బట్టి పెరటితోటలో ఒకవైపున కంపోస్ట్ పిట్‌ను ఏర్పాటు చేసుకోవాలి. పెరటిలో తగినంత స్థలం ఉన్నట్లయితే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మరియు ఉపాధిహామీ పథకం కలిసి ఏర్పాటు చేయుచున్న వర్మి కంపోస్ట్ యూనిట్ ను ఏర్పాటు చేసుకోవచ్చు. ప్రతిరోజు వంట చేసినప్పుడు వచ్చే కూరగాయల వ్యర్థ పదార్థాలను కంపోస్ట్ తయారీలో వాడుకోవచ్చు.
- పసువుల పేడ, మూత్రం, గడ్డీ, ఆకులతో కూడిన సేంద్రియ ఎరువులు, కాషాయాల వలన మట్టి సారవంతమవుతుంది. మొక్కలు ఆరోగ్యవంతముగా పెరుగుతాయి.
- వంటింట్లో చెత్తబుట్టలోకి చేరుతున్న వ్యర్థ పదార్థాలతోనే కంపోస్ట్ తయారుచేసుకోవచ్చు. రోజూ వంటింటి వ్యర్థ పదార్థాలను ఇంటి బయట మట్టి కుండ/పాత్రలో పద్ధతి ప్రకారం వేస్తే 90 రోజుల్లో కంపోస్ట్ తయారు అవుతుంది. నెలకొకసారి మొక్కలకు వేయాలి.

**విత్తన సేకరణ - వాడకం:**

- పెరటితోటలు పెంచుకుంటున్నవారు విత్తనాలు ప్రతిసారి కొనుగోలు చేయనవసరం లేదు. ఆరోగ్యంగా ఎదిగిన మొక్కలనుండి, బాగా పెరిగిన కాయను విత్తనాల కోసం ఎంపిక చేసుకుని, ఎండిన తరువాత విత్తనాలను తీసి నిల్వ చేసుకోవాలి. ఆకుకూరల్లో ఆకులను కోసుకుంటూ పూత రానివ్వాలి. విత్తనాలను తీసుకున్న తరువాత మొక్కలు పీకేయవచ్చు. విత్తనాలను బూడిద కలిపి కాని, ఆవుపేడలో కలిపి పిడకలు చేసి కాని నిల్వ ఉంచుకోవచ్చు. విత్తనాలు సేకరించిన తరువాత 6 నుండి 12 నెలలలో వాడాలి. *

## 500 దాటిన రైతు అమరవీరులు

కేంద్ర బీజేపీ ప్రభుత్వం తెచ్చిన మూడు నల్ల వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా పోరాటం ప్రారంభమైన తరువాత నుంచి నేటి వరకూ ఉద్యమంలో అమరవీరులైన రైతుల సంఖ్య 500 దాటింది. ఈ మేరకు జూన్ 9న సంయుక్త కిసాన్ మోర్చా (ఎస్‌కెఎం) నేతలు బల్బీర్ సింగ్ రాజేవాల్, డాక్టర్ దర్శన్‌పాల్, గుర్నమ్ సింగ్ చారుని, హన్నన్‌మొల్లా, జగ్జీత్‌సింగ్ దల్లెవాల్, జోగిందర్ సింగ్ ఉగ్రహాన్, యుధ్వీర్ సింగ్, యోగేంద్ర యాదవ్, అభిమన్యు కోహార్ ప్రకటన విడుదల చేశారు. సమర్థన లేకుండా అహం సమస్యల కారణంగా కేంద్ర ప్రభుత్వం ఆందోళనను కొనసాగిస్తుండగా, మార్కెట్లో మద్దతు ధరలు లేకపోవడం వల్ల రైతులు విపరీతంగా నష్టపోతున్నారని అన్నారు. పంజాబ్‌లో మొక్కజొన్న క్వింటాలుకు రూ. 1,850 కనీస మద్దతు ధర ప్రకటిస్తే రైతులకు కేవలం రూ. 700 నుంచి రూ. 800 వరకే వస్తోందన్నారు. ఇది రైతులు సాగు, ఉత్పత్తి వ్యయాన్ని కూడా సాధించి పెట్టదని పేర్కొన్నారు. ఇతర ఖర్చులతోపాటు డీజిల్ ధరలు పెరుగుతూనే ఉన్నాయని, ఒక వ్యవసాయ కుటుంబం ఈ రకమైన పునరుత్పాదక మార్కెట్లతో ఎలా జీవించగలరని వారు ప్రశ్నించారు.

## మే 26న రాష్ట్ర వ్యాప్తంగా నిరసనలు...



విశాఖపట్నంలో....




విజయనగరంలో...



శ్రీకాకుళంలో



# ఖరీఫ్‌లో అంతర పంటలు

జి.అరవింద్, సి.భానుతేజ, హుస్సేన్, ఎస్.మేఘన,
జె.డి. సరిత, ఆర్.సుశీల, కె.విజయలక్ష్మి,
వ్యవసాయ కళాశాల, పాలెం.

పంటల భ్రమణంలో అంతర సస్యవర్ధన వ్యవస్థలు పాటించడం వల్ల ప్రతికూల వాతావరణ పరిస్థితుల్లో కూడా రైతుకు ఏదో ఒక పంట చేతికందుతుంది. ఏక పంట సాగు పద్ధతిలా ఈ పద్ధతిలో రైతు పూర్తిగా నష్టపోడు. అంతర సస్యవర్ధన వ్యవస్థలో రెండు వేర్వేరు రకాల పంటలు వేయడం వల్ల వివిధ కాలాల్లో కోతకు వస్తాయి. కాబట్టి కూలీల ఆవశ్యకత సర్దుబాటు చేసుకోవచ్చు.

**లాభాలు :**

- అంతర పంటలు వేయడం వల్ల సూర్యరశ్మి, తేమ, పోషకాల వంటి వనరులను పూర్తిగా వినియోగించుకుంటాయి.
- అంతర పంట వల్ల కలుపు, చీడపీడల ఉధృతి తక్కువగా వుంటుంది.
- అంతర పంటగా ఒక పప్పుజాతి పంటను వేయడం వల్ల నేల సారాన్ని పెంచవచ్చు.
- ప్రతికూల వాతావరణ పరిస్థితులు వచ్చినప్పుడు ఒక పంట నష్టం కలిగించినా మరో పంట ఆదాయం ఇస్తుంది.
- కొంతకాలంపాటు ఉత్పత్తిలో స్థిరత్వం సాధించవచ్చు.

**వివిధ పంటల్లో వేసే అంతర పంటలు :**

**1) మొక్కజొన్న**

మొక్కజొన్న + కంది - 2 : 1 లేదా 5 :1
మొక్కజొన్న + పెసర / మినుము - 1 : 6

**2) జొన్న**

జొన్న + కంది - 4 : 1 / 2 : 1

**3) సజ్జ**

సజ్జ + కంది - 4 : 1 లేదా 6 : 1

**4) కొర్రలు**

కొర్ర + కంది / సోయా చిక్కుడు - 5 : 1

**5) కంది**

కంది + జొన్న - 1 : 2
కంది + మొక్కజొన్న / సజ్జ - 1 : 4
కంది + పెసర / మినుము - 1 : 7
కంది + పత్తి - 1 : 4 / 1 : 6
కంది + పసుపు - 1 :4 / 1 : 6

**6) పెసర**

పెసర + కంది - 1 : 1
పెసర + పత్తి - 2 : 1 / 1 : 1

**7) సోయా చిక్కుడు**

సోయ + కంది - 7 : 1
సోయ + పత్తి - 1 : 1
సోయ + మొక్కజొన్న - 1: 1

**8) వేరుశనగ**

వేరుశనగ + బెబ్బర్లు - 10 : 1

**9) పొద్దు తిరుగుడు**

పొద్దు తిరుగుడు + వేరుశనగ - 2 : 4

**అంతర పంటల్లో సాగు - ప్రయోజనాలు :**

ముఖ్యంగా ఖరీఫ్ పంటకాలం జూన్ - అక్టోబరు వరకు ఉంటుంది. రైతులు ఎక్కువగా అంతర పంటగా ఎన్నుకునే పంట వర్షాభావ పరిస్థితులను తట్టుకునే విధంగా ఉన్న పంటలను ఎంచుకోవాలి. లెగ్యూమినేసి (పప్పు జాతి పంటలు) కుటుంబానికి చెందిన పంటలను ఎక్కువగా అంతర పంటలుగా ఎన్నుకోవాలి.

**ఉదాహరణ :** వేరుశనగ + కంది - 7 : 1
ఆముదం + పెసర - 1 : 1

- అంతర సస్య వర్ధనంలో సాగు చేయడానికి ఉపయోగించే పంటలు ఒకే కుటుంబానికి చెందినవి అయి ఉండకూడదు.
- అంతర పంటగా మనం లోతైన వేరు వ్యవస్థ, తక్కువ లోతైన వేరు వ్యవస్థ కలిగిన పంటలను ఎంచుకోవాలి. దీనివల్ల పోషకాలను సమర్థవంతంగా ఉపయోగించుకోవచ్చు.
- అంతర పంటల్లో నేలను నిస్సారం చేసే పంట, నేలను సారవంతంగా చేసే పంటలను ఎంచుకోవడం మంచిది.
- అంతర పంటల వల్ల తక్కువ ఖర్చుతో ఎక్కువ దిగుబడులు సాధించవచ్చు. రసాయన ఎరువుల ఖర్చును తగ్గించొచ్చు. ఉదాహరణకు లెగ్యూమినేసి పంటలు వాతావరణంలో ఉన్న నత్రజనిని స్థిరీకరించి మొక్కలకు అందిస్తుంది.



# కొత్తిమీర లాభసాటి సాగు

జి.హర్షవర్ధన్, వి.శ్రావణి, బి.భవాని,
అసిస్టెంట్లు ప్రొఫెసర్లు
శ్రీకింజరాపు ఎర్రన్నాయుడు వ్యవసాయ కళాశాల
మురపాక, ఎస్.ఎస్.ఆర్.పురం, ఎచ్చెర్ల, శ్రీకాకుళం

ఆంధ్రప్రదేశ్, తెలంగాణాల్లో పండించే ఆకుకూరల్లో కొత్తిమీర ముఖ్యమైంది. దీనిని ధనియాల కోసం రబీలో సాగు చేస్తారు. కొత్తిమీర కోసం ఏడాది అంతా సాగు చేసుకోవచ్చు. కానీ వేసవిలో మాత్రం చెట్టు నీడలోకానీ, తోటకు పందిరి కిందగానీ షేడ్ నెట్ కిందగానీ, నీటి వసతి ఉన్న ప్రాంతాల్లో గానీ సాగు చేసుకోవచ్చు.

రైతులు ముఖ్యంగా రకాల ఎంపికలో జాగ్రత్త వహించాలి. అధిక దిగుబడిని ఇచ్చే రకాలు, చీడపీడలు తట్టుకునే రకాలు ఎంపికి చేసుకోవాలి. సాధన, సింధు, స్వాతి, సుధ, ఏపి. హెచ్.యు ధనియా-1 రకాలు సాగులో ఉన్నాయి.

**నేల తయారీ :** మెత్తటి పదును వచ్చే వరకూ మూడు నాలుగు సార్లు దుక్కి దున్నాలి. వేసవిలో మాత్రం లోతు దుక్కి దున్నుకోవాలి. దీని వల్ల తెగులును కలుగజేసే శిలీంద్రాన్ని నేలలోనే అదుపు చేయొచ్చు.

**విత్తనం వేయడం :** విత్తనాలను బద్దలు చేసి విత్తితే విత్తనం ఆదా అవడమేగాక మొలక కూడా రెండు మూడు రోజుల ముందుగా వస్తుంది. విత్తే ముందు ఐదారు గంటల సేపు నీటిలో నానబెట్టి, ఆరనిచ్చి విత్తేటట్టయితే విత్తనం త్వరగా మొలుస్తుంది. ఎకరానికి ఆరు కిలోల విత్తనం అవసరం అవుతుంది. విత్తే ముందు (ఏడు రోజుల ముందు) ఒక కిలో ట్రైకోడెర్మా 100 కిలోల పశువుల ఎరువుతో కలిపి ఏడు రోజులపాటు తిరగేయాలి. లేదా సూడోమోనాస్ ఎకరానికి 600 గ్రాముల చొప్పున మోతాదు విత్తనానికి కలిపి శుద్ధి చేస్తే దిగుబడి 10 నుంచి 15 శాతం పెరుగుతుంది. ఒక గ్రాము కార్బెండెజిమ్‌తో ఒక కిలో విత్తనానికి విత్తనశుద్ధి చేయడం ద్వారా తెగులు రాకుండా కాపాడవచ్చు. అదే విధంగా కలుపు రాకముందే ప్రీ ఎమర్జెన్స్ హెర్బిసైడ్ "ఫ్లుక్లోరాలిన్" మందును 280 మిల్లీలీటర్ల మందు 200 లీటర్ల నీటికి కలిపి నేలను పిచికారీ చేస్తే కలుపును అరికట్టొచ్చు.

**ఎరువుల యాజమాన్యం :** ఆఖరి దుక్కిలో ఎకరానికి నాలుగు టన్నుల పశువుల ఎరువుతోపాటు నాలుగు కిలోల నత్రజనిని ఎకరానికి పిచికారీ చేస్తే ఆకు బాగా పెరిగి అధిక దిగుబడిని ఇస్తుంది.

**పంటకోత :** రకాన్నిబట్టి 40 నుంచి 45 రోజులకు ఆకు తయారవుతుంది. పంటను ఉదయం పూట మాత్రమే కోయాలి.

## రబీ ధాన్యం కొనుగోలులో అక్రమాలు అరికట్టాలి

రాష్ట్రవ్యాప్తంగా ప్రభుత్వ ధాన్యం కొనుగోలు కేంద్రాల్లో పలు అక్రమాలు జరుగుతున్నా సంబంధిత అధికారులు పట్టనట్లు వ్యవహరిస్తున్నారని, తక్షణమే రైతులకు జరుగుతున్న అన్యాయాన్ని, అధికారుల అక్రమాలను అరికట్టాలని పౌరసరఫరాల శాఖ కమిషనర్, ఆ సంస్థ ఎమ్‌డీని ఎపి కౌలు రైతు సంఘం డిమాండ్ చేసింది. రాష్ట్రంలోని రైతులకు రబీ ధాన్యం కొనుగోలు వ్యవహారంలో జరుగుతున్న అన్యాయాన్ని అరికట్టాలని కానూరులోని పౌరసరఫరాల శాఖ రాష్ట్ర కార్యాలయం ముందు కౌలు రైతు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి పి.జమలయ్య నేతృత్వంలో మే 24న ఆందోళన నిర్వహించారు. ఈ సందర్భంగా జమలయ్య మాట్లాడుతూ.. రాష్ట్రంలో రబీ ధాన్యం కొనుగోలు పూర్తిగా ప్రారంభం కాలేదని, కొన్ని చోట్ల పిపిసిలు ప్రారంభం కాలేదని అన్నారు. ప్రారంభమైన చోట్ల క్వింటాలు ధాన్యం కొనుగోలు చేసేందుకు పది కిలోలు అదనంగా ఇవ్వాలని రైతులను సూపర్‌వైజర్లు అడ్డంగా దోచుకుంటున్నారని ఆందోళన వ్యక్తం చేశారు. కృష్ణాజిల్లా కంకిపాడు, మైలవరం, ఇబ్రహీంపట్నం పిపిసి సెంటర్లే ఇందుకు ఉదాహరణ అన్నారు. సేకరించిన ధాన్యానికి తూర్పుగోదావరి జిల్లాలో చెల్లింపులు జరగడం లేదన్నారు. ధాన్యం సేకరించిన 72 గంటల్లో చెల్లింపులు చెస్తామని చెప్పారని ఇప్పుడు 20 రోజులైనా రైతుల ఖాతాల్లో డబ్బులు పడలేదని విమర్శించారు.

# సమస్యాత్మక భూములు యాజమాన్య పద్ధతులు

ఎన్.మేఘన, వి.శృతి,
ఎస్.సిద్ద శ్రీలాస్య, ఎం.అనిల్‌కుమార్,
జె.డి.సంత, ఆర్.సుశీల, కె.విజయలక్ష్మి
మృత్తిక విభాగం వ్యవసాయ కళాశాల, పాలెం

పైర్ల సాగు, పంట పండించే రైతులకు నేల స్వభావం తెలిసి వుండాలి. ఏ నేలలో ఏ పైరు సాగు సాయాలో అవగాహన ఉండాలి. ఉదజని సూచిక ఏడుకన్నా ఎక్కువ ఉండే భూములను చౌడు భూములు అంటారు.

నేల ఉదజని సూచిక 8.5 కన్నా ఎక్కువగా ఉండి వీటిల్లో మార్పిడయ్యే సోడియం 15 శాతం కన్నా అధికంగా ఉంటుంది. వీటిని నల్ల చౌడు లేదా కారు చౌడు భూములు అంటారు.

చౌడు తీవ్రంగా ఉంటే విత్తనం మొలకెత్తదు. మొక్క నాటినా నిలదొక్కుకోదు. గింజ మొలిచినా పైరు ఆరోగ్యంగా పెరగదు. దిగుబడి తక్కువగా ఉంటుంది. లక్షణాలను బట్టి చౌడు భూములు మూడు రకాలుగా ఉంటాయి.

## తెల్లచౌడు లేదా పాల చౌడు భూములు

ఈ నేలలో నీటిలో కరిగే లవణాల శాతం ఎక్కువగా (1.5 శాతం) ఉంటుంది. కొన్నిసార్లు వేసవి కాలంలో ఈ లవణాలు నేల ఉపరితలంపైన పేరుకుపోయి కనపడతాయి. లవణాలు అధికంగా ఉండటం వల్ల మొక్కల పెరుగుదల సన్నగిల్లి దిగుబడులు తగ్గుతాయి. ఎందుకంటే ఈ నేలలో మార్పిడి కాగల సోడియం 15 శాతం కన్నా తక్కువగా ఉంటుంది. క్లోరైడ్, సల్ఫేట్ అధికంగా ఉంటాయి.

### యాజమాన్యం

- నేలలో ఉన్న లవణాలను పరిమితి స్థాయికి తీసుకురావడానికి మట్టిని ఒక పొర (5 సెంటీ మీటర్లు) తొలగించాలి.
- పశువుల ఎరువు, పచ్చిరొట్టి, ఆమ్ల స్వభావంగల రసాయన ఎరువులు.. ఉదాహరణకు యూరియ, అమ్మోనియం సల్ఫేట్
- ఉప్పును తట్టుకునే పంటలైన వరి, చెరకు, సజ్జవిత్తుకోవడానికి ముందు 0.1 శాతం ఉప్పు ద్రావణంతో విత్తనాలను నీటితో ఉప్పు తట్టుకునే శక్తి పెరుగుతుంది.

## నల్లచౌడు లేదా కారు చౌడు భూములు

ఈ నల్లచౌడు నేలల్లో సోడియం 15 శాతం కన్నా ఎక్కువగా ఉండి, ఉపరితలం నల్లగాచి లేదా బూడిద రంగులో కనపడతాయి. ఈ నేలలు సేద్యానికి అనుకూలం కాదు. ఎండిన తర్వాత చాలా గట్టిగా మారతాయి. ఎందుకంటే నీటి నిల్వ సామర్థ్యం తక్కువగా వుండటం వల్ల పంట పెరుగుదలను తగ్గిస్తాయి.

### యాజమాన్యం

- ఉదజని సూచికను అనకూలమైన స్థాయి తగ్గించడం సోడియం 15 శాతం కన్నా తక్కువ స్థాయికి తీసుకొని రావడానికి సాధారణంగా 1.2 - 1.6 టన్నుల జిప్సంను ఒక ఎకరానికి వాడుకోవచ్చు.
- ఒక వేళ నేలలో సున్నం అధికంగా ఉంటే ఐరన్ పైరేట్, ఆమ్లం ఉత్పత్తి చేసే రసాయనాలను వాడుకోవాలి.
- జిప్సంకు బదులుగా ప్రెస్ మడ్ కూడా (చెరకు పరిశ్రమ వ్యర్థాలు) ఎకరానికి 1.2 నుంచి 1.6 టన్నులు దుక్కులో వాడుకోవచ్చు.
- ఈ నేలలు ఎండిన తర్వాత గట్టిగా మారతాయి. అందువల్ల లోతు దుక్కులు చేయడం మంచిది. తద్వారా నేలలో గాలి పెరిగి మొక్కల పెరుగుదలకు ఉపయోగపడుతుంది.

### ఉప్పు చౌడు నేలలు

ఈ నేలలు ఎండాకాలం పైభాగంలో తెల్లని ఉప్పు పొంగి ఉండటం, నేల మెత్తటి పొడిగా ఉండటం గమనించవచ్చు. ఈ నేలలో సోడియ 15 శాతం కన్నా తగ్గించడానికి పొలాన్ని చదును చేసి మురుగునీటి కాల్వలు చేసుకోవాలి.

**యాజమాన్యం**

- ఈ నేలల్లో మెత్తగా పొడి చేసిన జిప్సంను నేలల్లో కలియదున్ని నీరు నిలవగట్టి, మూడు నాలుగు సార్లు నేలల్లో ఇంకేలా చూడాలి.
- ఎండా కాలంలో నేలపైన పొంగి ఉన్న ఉప్పును పారతో చెక్కేయాలి.
- ఖరీఫ్‌లో వర్షాధార పంటలను సాగు చేసుకోవాలి.
- వర్షపు నీరు వృధా కాకుండా గట్లు నిర్మించుకొని పొలంలోనే ఇంకిపోయేటట్లు చూడాలి.
- బోదెలను, గట్లను వాలుకు అడ్డంగా నిర్మిస్తే లవణాల హాని తక్కువగా ఉంటుంది.

చౌడు తట్టుకునే పంటలను ఎంపిక చేసుకోవడం వంటి అన్ని రకాల యాజమాన్య పద్ధతుల ద్వారా చౌడు భూములను వ్యవసాయ యోగ్యంగా మార్చుకోవచ్చు.

### ఆమ్ల నేలలు

ఆమ్ల నేలలు ఉదజని సూచిక ఏడు కన్నా తక్కువగా ఉంటాయి. అప్పుడు ఈ నేలలను గుర్తించి వాటిని తటస్థ ఉదజని స్థాయికి తీసుకురావడానికి కొన్ని యాజమాన్య పద్ధతులు పాటించాలి. ముందుగా ఈ నేలలు అధిక వర్షపాతం గల ప్రాంతాల్లో ఏర్పడతాయి. పైకి చూడటానికి ఈ నేలలు తేలికగా ఎర్రగా ఉంటాయి.

**యాజమాన్యం**

- ఈ నేలలను బాగు చేయడానికి సున్నం, బేసిక్ స్లాగ్, చెరుకు పరిశ్రమ ముడి పదార్థం అయిన ప్రెస్ మడ్‌ని కూడా ఉపయోగించొచ్చు.
- ఎకరానికి రెండు లేదా మూడు టన్నుల సున్న వేయొచ్చు.
- మొదటి రెండు మూడేళ్లు సున్నం బాగా అవసరమయ్యే లెగ్యుమ్ / అపరాల పంటలను, కూరగాయలను పండించొచ్చు.

వేసిన సున్నం ప్రభావం ఐదు సంవత్సరాల వరకూ ఉంటుంది. కాబట్టి ఆ తరువాత సున్న అవసరం లేని వేరే పంటలు వేసుకోవచ్చు.

### సల్ఫైడ్ దుష్ప్రభావ నేలలు

ఈ నేలలు చాలా కాలం నీటి ముంపునకు గురైన, మురుగు కాలువలు తీయడానికి సౌకర్యలేని చోట్ల గమనించొచ్చు. సల్ఫైడ్ ప్రభావానికి గురైన పొలంలోని దుబ్బులు పూర్తిగా కోలుకోనప్పుడు పంట దిగుబడి తగ్గుతుంది. ఈ సల్ఫైడ్ దుష్ప్రభావం కలిగినప్పుడు పొలంలోని లోతైన దుబ్బులు వెలుపలికి తీసినప్పుడు అందులో ఉన్న వేర్లు.. ఉదాహరణకు వరి వేర్లు కుదించుకుపోయి కుళ్లి నలుపు నుండి ...లి రంగు కలిగి దుర్గంధం వస్తుంది.

ఇలా సల్ఫైడ్ దుష్ప్రభావం గమనిస్తే నీటిని తీసివేయాలి. తద్వారా ...లకు గాలి తగిలి నీరు నిల్వలేకుండా చూసుకోవచ్చు.

### గలస అధికంగా ఉండే నేలలు

ఈ గలస అధికంగా ఉండే నేలలో నీటిని ఇంకించుకునే శక్తి తక్కువగా ఉంటుంది. దీనికి కారణం అధికంగా బంక ఉండటం తద్వారా నీరు నేలపై నిల్వ ఉండటం వల్ల అలాగే నేల గట్టిగా ఉండటం వల్ల పంటలు పెరగడం కష్టసాధ్యమవుతుంది.

**యాజమాన్యం**

ఈ నేలలను ఒక మీటరు వెడల్పుగల బెడ్లు లేదా బోదెలను ఏర్పాటు చేసుకొని వాటికి పంటలు పండించుకోవాలి. అలాగే సేంద్రియ ఎరువులు, పంట వ్యర్థాలు వంటివి వాడుతుండటం వల్ల ఈ నేలలను బాగు చేసుకోవచ్చు

### తక్కువ నీటి నిల్వగల భూములు

ఈ నేలలో అధికంగా ఇసుక శాతం ఉండటం వల్ల నీటి నిల్వ సామర్థ్యం తక్కువ కాబట్టి నీరు తగినంత మొక్కకు అందకపోవడం వల్ల దిగుబడి తగ్గుతుంది. ఈ నేలల్లో దిగుబడిని పెంచడానికి ఎకరానికి 40 టన్నుల చేదు స్వభావం లేని చెరువు మట్టిని వేసవిలో వర్షాలకు ముందే తోలాలి. ఇలా చెరువు మట్టిని చేను మొత్తం పలుచగా చల్లి భూమిలో కలియదున్నాలి.

ఇలా చెరువు మట్టిని నేలలో వేయడం వల్ల భూమిలో బంక మన్ను శాతం శాతం పెరుగుతుంది. దీనిద్వారా నీటిని, పోషక పదార్థాలను నిలుపుకునే శక్తి పెరుగుతుంది. చెరువు మట్టి వేసిన తర్వాత చేనును కలియదున్నాలి. చెరువు మట్టితోపాటు పశువుల ఎరువు కూడా వాడొచ్చు.



# ఖరీఫ్ పంటలలో
## మొదటి దఫాలో వేయాల్సిన ఎరువులు


సిర్గ శ్రీలాస్య, ఎం. అనిల్ కుమార్,
కె.అనూష, జి.అరవింద్, జె.డి. సరిత,
ఆర్.సుశీల, కె.విజయలక్ష్మి,
వ్యవసాయ కళాశాల, పాలెం.


**వరి :**

పశువుల ఎరువు, కంపోస్టు, కోళ్ల ఎరువు వంటి సేంద్రియ ఎరువులను రసాయనిక ఎరువులతో కలిపి వాడితే భూసారాన్ని కాపాడుకోవడమేగాక, 20 నుంచి 25 శాతం నత్రజనిని ఆదా చేయొచ్చు. స్వల్ప కాలికి రకాలకు నత్రజనిని మూడు సమభాగాలుగా చేసి, నాటటానికి ముందు దమ్ములోనూ, బాగా దుబ్బు చేసే దశలోనూ, అంకురం తొడిగే దశలోనూ, బురద పదునులో మాత్రమే సమాన పాళ్లలో వెదజల్లి 36 నుంచి 48 గంటల తర్వాత పలుచగా నీరు పెట్టాలి. మధ్య, దీర్ఘకాలిక రకాలకు నాలుగు దఫాలుగా 15 నుంచి 20 రోజులకు ఒకసారి నత్రజనిని వేయాలి. నత్రజనిని చివరిదఫా అంకురం దశలో వేయాలి. ఆ తర్వాత వేయకూడదు. ప్రస్తుతం మార్కెట్‌లో లభిస్తున్న వేపతో పూసిన యూరియాని వాడాలి. వేపపూత కలిగిన యూరియా మొక్కలకు నెమ్మదిగా అంది పది శాతం వినియోగ సామర్థ్యం ఎక్కువవుతుంది.

- మొత్తం భాస్వరం ఎరువును దమ్ములోనే వేయాలి. ఆ తరువాత కాంప్లెక్స్ రూపంలో వేయకూడదు.
- పొటాష్ ఎరువును రేగడి నేలల్లో ఆఖరి దుమ్ములో పూర్తిగా ఒకేసారి వేయాలి. చల్కా (తేలిక) భూముల్లో ఆఖరి దమ్ములో సగం, అకురం ఏర్పడే దశలో మిగతా సగాన్ని వేయాలి
- వానాకాలంలో ఎకరానికి 40 నుంచి 48 కిలోల నత్రజని, 24 కిలోల భాస్వరం, 16 కిలోల పొటాష్ చొప్పున వేయాలి

**మొక్కజొన్న :**

నత్రజని - 1/3 వంతు దుక్కిలో, 1/3 వంతు పైరు మోకాలు ఎత్తు దశలో, 1/3 వంతు పూద దశలో వేయాలి. అలాగే భాస్వరం మొత్తం దుక్కిలో వేయాలి. ఇక పొటాష్ 1/2 వంతు దుక్కిలో, మరో 1/2 వంతు పూత దశలో వర్షాకాలంలో సాధారణ సంకర రకాలకు 72 నుంచి 80 కిలోలలు నత్రజని, 24 కిలోల భాస్వరం, 20 కిలోల పొటాష్ చొప్పును ఎకరానికి ఇవ్వాలి

**జొన్న :**

ముందుగా ఎకరానికి మూడు నాలుగు టన్నుల పశువుల ఎరువు వేసి ఆఖరి దుక్కిలో కలియదున్నాలి. ఖరీఫ్‌లో వర్షాధారంగా సాగు చేసినప్పుడు ఎకరానికి 24 కిలలో నత్రజని, 12 కిలోల భాస్వరం, 8 కిలోల పొటాష్ ఇచ్చే ఎరువులు వేసుకోవాలి.

**సజ్జ :**

ఎకరానికి మూడు నాలుగు టన్నుల పశువుల ఎరువు, ఆఖరి దుక్కిలో వేసి కలియదున్నాలి. వర్షాధారంగా సాగు చేసినప్పుడు ఎకరానికి 24 కిలల నత్రజని, 12 కిలోల భాస్వరం, 8 కిలోల పొటాషియం ఇచ్చే ఎరువులు వేసుకోవాలి.

**రాగి :**

నాటే ముందు ఎకరానికి నాలుగు టన్నుల పశువుల ఎరువు ఆఖరి దుక్కిలో వేసి కలియ దున్నాలి. ఎకరానికి 25 నుంచి 30 కిలోల డి.ఏ.పి, 15 కిలోల మ్యూరేట్ ఆఫ్ పొటాష్ నాటేటప్పుడు వేయాలి. నాటిన 30 రోజులకు 25 కిలోల యూరియా పైపాటుగా వేసుకోవాలి.

**కంది :**

తొలకరి కందికి ఎకరానికి 8 కిలోల నత్రజని, 20 కిలోల భాస్వరం ఇచ్చే ఎరువులు ఆఖరి దుక్కిలో వేసుకోవాలి. అంటే 18 కిలోల యూరియా, 125 కిలోల సింగిల్ సూపర్ ఫాస్పేట్ లేదా 50 కిలోల డి.ఏ.పి.ని వాడాలి.

**ఆముదం :**

భూసార పరీక్షా ఫలితాలననుసరించి ఎరువుల మోతాదున నిర్ణయించుకోవాలి. ఎకరానికి 2 నుంచి 3 టన్నుల పశువుల ఎరువున దుక్కిలో వేసి కలియదున్నాలి. సూటి రకాలను సాగు చేస్తే ఒ ఎకరానికి 24 కిలోల నత్రజని, 16 కిలోల భాస్వరం, 12 కిలో పొటాషియం ఇచ్చే ఎరువులను వేసుకోవాలి. ఈ మోతాదులో సగభాగ నత్రజని, మొత్తం భాస్వరం, పొటాష్‌ను దుక్కిలో వేయాలి.

**పత్తి :**

సాధారణ / సూటి రకాలకు ఎకరానికి 36 కిలోల నత్రజని, 1 కిలోల భాస్వరం, 12 కిలోల పొటాషియం ఇచ్చే ఎరువుల వేసుకోవాలి. సిఫార్సు చేసిన భాస్వరం మొత్తాన్ని సింగిల్ సూప ఫాస్పేట్ రూపంలో ఎకరానికి విత్తే ముందు ఆఖరి దుక్కిలో వే కలియదున్నాలి. లేదా విత్తిన 15 రోజులలోపు కూడా చేసుకోవచ

# విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు




- రెడ్డి శంకరరావు
సెల్ : 94 94 33 35 11


పల్లవి : వస్తున్నాం...వస్తున్నాం...వస్తున్నాం
విశాఖ స్టీల్ రక్షణకై ...
వీరుల్లా వస్తున్నాం.........2

పోస్కోను తరిమికొట్టగా
యోధుల్లా వస్తున్నాం
వస్తున్నాం...వస్తున్నాం...వస్తున్నాం

చరణం 1 :
దుఃఖ మంత దుమ్మిదులిపి
ఉద్యమించగా....
పిడికిళ్లన్ని ఒక్కటి చేసి
పోరు చేయగా...
సలసల మరుగుతున్న
వుడుకు నెత్తురు.....
విశాఖ ఉక్కు రక్షణకి
దారపోయగా....

నవయువకులు... విద్యార్థులు
కలిసే వస్తున్నాం...
గుండె గుండె నూ కలిపి
దండుగా వస్తున్నాం....

చరణం: 2
భవిత మనది...
భుక్తి మనది...
బంగారు ప్రగతి మనది

మన భవితను బుగ్గిచేసి
మన భుక్తిని కాలరాసే
విశాఖ స్టీల్ ప్లాంట్ ను
పోస్కోకు అమ్మేస్తే....
చూస్తూ ఊరకోబోమని
గర్జించే సింహాలై వస్తున్నాం

వస్తున్నాం...వస్తున్నాం...వస్తున్నాం
భగభగ మండే సూర్యులైవస్తున్నాం

చరణం: 3
మా తాతలు..మాతండ్రుల
ప్రాణత్యాగం....
మా అన్నలు మా తమ్ములు
అమృత స్వేదం...
విశాఖ ఉక్కు రా...
మన భవిత దిక్కురా
వెలుగు తున్న ఉత్తరాంధ్ర
వేగు చుక్క రా....

చరణం: 4
తరతరాల మన సంపద
దశాబ్దాల మన ఆస్తి....
సొంత గనులు లేక
తల్లడిల్లు తింటే....
నష్టాల బూచి చూపి
పోస్కోకి కట్టబెడితే
చూస్తూ ఊరకోబోమని
నవయువకులు... విద్యార్థులు
పెనువుప్పెనై కదిలితే
కాపాడుకోలేమా విశాఖ ఉక్కును
రక్షించు కొలేమా ....
ఉత్తరాంధ్ర భవితను

# శ్మశానాలే చెబుతున్నాయి



- ఎం.వి. స్వామి,
సెల్ : 94415 71505

శ్మశానాలే చెబుతున్నాయి
మరణాల లెక్కలను
తారుమారు చేసి
తమ గొప్పలకు లోటు...ఆ
ప్రతిష్ఠకు చేటు రాకుండా
ఆత్మవంచన చేసుకుంటూ
మసిబూసి మారేడుకాయ
చూపిస్తూ మర్మగర్భమౌతున్న
ప్రభుత్వాలు ఒక్కసారి
శ్మశాన వాకిట నిలుచుంటే
ఆప్తులను కోల్పోయిన
కుటుంబాల ఆక్రందనలు
తెల్పుతాయి ఆ లెక్కలు!
ప్రభుత్వ నిర్లక్ష్యం వల్ల కొన్ని
ప్రాణవాయువు లేక కొన్ని
ప్రాణాయామం తెలీక కొన్ని
అయినవారు కాదన్నాక కొన్ని
అన్నీ కలిపి రోజుకి
గుట్టలు గుట్టలుగా శవాలు
వల్లకాటికి వస్తుంటే
ఒకడు మీనమేషాలు లెక్కిస్తే
మరొకడు మీసాలపై ఫిడేల్ వాయిస్తూ
ప్రజల దృష్టి మళ్లించడానికి
ప్రణాళికలు ఆలోచిస్తున్నాడు!
అందాక అందరినీ
సెంటిమెంట్ లో ముంచడానికి
భారత చరిత్ర మొత్తం
దైవాధీనమని చేతులెత్తేస్తున్నాడు!
పిల్లి మీద ఎలుక
ఎలుక మీద పిల్లి
రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు!
పౌరులందరూ జీవించే హక్కుకై
కనీస టీకాలు వేయించలేని
ప్రభుత్వాలు వున్నా...
ఊడినా ఒక్కటే కదా!
ఇటువంటి స్వార్థపు ప్రభుత్వాలకు
ఓ దండమెట్టి శవమే
వేగంగా సాగనంపేయ మంటోంది
ఓదార్పు ఒడిని చేర్చుకొనే...
చితిమంటలోకి !

# ఆకలి మరకలు..!!



- కొప్పుల ప్రసాద్
సెల్ : 98850 66235

ఆ అడుగులు రుధిర చిహ్నాలే
అంటుకున్న మరకలు
కాళ్లు గుర్తుల ప్రతిబింబాలే
ఆకలితో నిత్యం అలమటించే
వందల మైళ్ళ ప్రయాణాలు
దారి పొడుగునా సాగినా రక్త ధారలు
పాదాలు చీలి రక్తం తడిసి
భూమాతపై పెడితే
ఎర్రకోక చుట్టుకొని విషాదాన్ని నింపుకుంది
పాదరక్షలు అరిగిపోయి
ఒంట్లో మాంసం కరిగిపోయి
శక్తి అంతా ఆవిరై
నాలుగు మెతుకులు కరువై
నడవడమే బరువై
బాధాతప్త హృదయై
భవిత మీద ఆశతో నడుస్తుంది
ఆదుకునే నాథుడు లేక
కూటి కోసమే చెమట బిందువులతో
రహదారిపై ఘర్మ జలాన్ని కురిపించి
ఒంట్లో ఉప్పును బయటికి పంపించి
అలసిన శరీరాలు అవనిపై పడే
గమ్యం తెలియని బాటసారులై
కనుచూపు మేర కనిపించే
రహదారుల పైనే సమాధులు నిలిచాయి
మానని గాయమై
చెదిరిన బతుకులై
నిస్సహాయ నిస్పృహ జీవితం
కష్ట జీవుడికి నష్టమే తప్ప
అనంత జీవన యానంలో
అడుగులు ఎంచుకోవడం ఒక్కటే!

Printed & Published by B. Tulasi Das on behalf of A.P. Rytusangam, 3/4B, Bypass Road, Vaddeswaram, Tadepalli, Guntur Dt, A.P.
**At** Prajasakti Daily Printing Press, Krishna nagar, Tadepalli (M), Guntur (Dt.,) **Editor** : P. NarasimhaRao

# నల్ల వ్యవసాయ చట్టాల ప్రతుల దగ్ధం నిరసనలు



విజయనగరం జిల్లా బొబ్బిలి




శ్రీకాకుళం జిల్లా పార్వతీపురం




పశ్చిమగోదావరి జిల్లా




కడప



ప్రకాశం జిల్లా ఒంగోలు



పొట్టి శ్రీరాములు జిల్లా మర్రిపాడు




చిత్తూరు జిల్లా పలమనేరు



అనంతపురం జిల్లా గార్లదిన్నె

Date of Publication : 12th June 2021 Posted on 17th & 18th June 2021
MANARYTUVANI JUNE - 2021
R.NI. 52715/90 Pages : 52 Postal Regd. No. VJ/181/2019-21




వెల : రూ. 20/- పేజీలు : 52
సంవత్సర చందా : రూ.230/-




3/4B, Vaddeswaram Bypass , Vaddeswaram (Post), Tadepalli (Mandal), Guntur Dt, A.P.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M234 |
| పుస్తకం పేరు | రైతువాడి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | madhu |
| పేజీలు విడదీసినది | madhu |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |